Photo by P. N. Mehra



బహుమతి
పొందిన వ్యాఖ్య

అయ్యావారికీ దండం పెట్టు

పంపినవారు :
ఎస్. హెచ్. రావు - హైదరాబాద్

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటోశీర్షికల పోటీ,
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


చందమామ (అన్ని భాషలలో)
విడి కాపీ 50 నయా పైసాలు. (8 అణాలు)
సాలు చందా రు 6 లు.

వస్తున్నది



వాహినీ
వారి



హాస్య, శృంగార, వీర రసప్రధానమైన
విశిష్ట జానపద చిత్రం...

# రాజమకుటం

నిర్మాత - దర్శకుడు
బి. యన్. రెడ్డి



## 'చందమామ' కు

★

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్దికాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 3-0-0 పంపుతూవుంటే మీకు 8 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 1-0-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు వ్రాయండి.

★

**చందమామ పబ్లికేషన్స్,**
వడపళని, మద్రాసు - 26

పెద్ద రేడియోల లక్షణాలు అన్నియు గల చిన్నరేడియో




# టెలిరాడ్

వెల రు. 330/-

స్థానిక పన్నులు అదనం.

(3 మాడెల్సు)

మాడెల్ D. 639 W.K.—AC.
మాడెల్ D. 639 G.W.K.—AC/DC.
మాడెల్ D. 639 B.K.—DRY BATTERY

6 వాల్వులు, 3 బ్యాండ్లు

మీడియంవేవ్ - 185 నుంచి 550 మీటర్లవరకు
K-1, షార్టువేవ్ - 111 నుంచి 120 మీటర్లవరకు
K-2 షార్టువేవ్ - 11 నుంచి 41 మీటర్లవరకు.

---

మద్రాసుకు, ఆంధ్రప్రదేశ్‌కు పంపకదారులు :

తంతి : OBRED

**ఓబుల్‌రెడ్డి (మద్రాసు) ప్రైవేట్ లిమిటెడ్,**

ఫోన్: 84830

31, జనరల్ పేటర్స్‌రోడ్డు :: మద్రాసు - 2.



ప్రసిద్ధిగాంచిన దక్షిణ భారత సినీ తార

# టి. కృష్ణకుమారి

## ఎల్లప్పుడూ "శ్రీ వెంకటేశ్వర" చీరలనే కోరును..

వివేచనగల స్త్రీలూ కోరు 'శ్రీ వెంకటేశ్వర' పట్టుచీరలు, రేష్మ చీరలు, వాటి రమ్యమగు వన్నెలకు, మహోన్నతమైన నమూనాలకు శ్రేష్ఠతరమైన దర్జాలకు సాటిలేనివి.

అన్ని రకాలలోనూ దొరకును. మరియు అన్ని సమయములయందు మీకు అపూర్వశోభనిచ్చి మనోహరముగా రాణించునటుల చేయును.

ఇవన్నియుగాక మీకు ఎక్కువ సౌకర్యమునిచ్చు 'ఎరకండీషన్' (AIR-CONDITIONED) చేయబడిన గదులుగల అంగడి మాదొక్కటే. అచ్చట మీరు వచ్చినప్పుడెల్ల సంతసిల్లెదరు అంతయేగాక మీకెప్పుడూ అది మరవని తలంపుగానుండును!

# శ్రీ వెంకటేశ్వర సిల్క్ ప్యాలెస్

స్త్రీల ఉన్నతమైన వస్త్రాలకు రమ్యమైన స్థలం

284/1, చిక్కపేట., బెంగళూరు-2

ఫోన్: 6440

టెలిగ్రాం: "ROOPMANDIR

పోటీలేని
సౌందర్యానికి








రెమి

పౌడర్

Aykan



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఇదివరకు మీరు షేక్స్పియర్ నాటక కథలు చాలా చదివారు. ఈ సంచికలో భాసుడి నాటకకథ "మధ్యముడు" చదవండి. భాసుడు క్రీస్తుపూర్వం 4 వ శతాబ్దంలో జీవించాడనీ, కౌటిల్యుడనే పేరుతో అర్థశాస్త్రం రాసిన చాణక్యుడికి సమకాలికుడనీ, చాణక్యుడికంటె కొంచెం పెద్దవాడై ఉండవచ్చుననీ పరిశోధకులు చెబుతున్నారు.

భాసుడు కాళిదాసుకన్న ఏడెనిమిది శతాబ్దులు ముందువాడు. మొట్టమొదటి భారతీయ నాటకకర్త కూడా ఆయనే కావచ్చు. ఈయన పేరుతో ఉన్న నాటకాలు ఈనాడు మనకు లభ్యమవుతున్నాయి. భాసుడి నాటకాలను గురించి అనేక ఇతర గ్రంథాలలో ప్రస్తావించి ఉన్నప్పటికీ ఆ నాటకాలు ఇటీవలమాత్రమే బయటపడ్డాయి.

"మధ్యముడు" భారతకాలంనాటి కథగా భాసుడు రచించాడుగాని, ఇందులోని సంఘటన కేవలంకల్పన. ఇది హాస్యప్రధానమైన నాటకం.

సంపుటి 26 : జనవరి 1960 : సంచిక 1




నాలుగవరోజు ఉదయం ఉభయ సేనలూ తిరిగి యుద్ధానికి తలపడ్డాయి. ఆ రోజు పాండవ వ్యూహాన్ని ధర్మరాజు ఒక కొత్త పద్ధతిలో రచించాడు. దానిముందు అర్జునుడు కపిధ్వజం గల రథంమీద నిలబడి భీష్మ ద్రోణాది కౌరవ వీరుల రాకకోసం ఎదురుచూస్తున్నాడు.

యుద్ధం ఆరంభమవుతూనే భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, శల్యుడూ, వివింశతీ, దుర్యోధనుడూ, సోమదత్తి అనే యోధులందరూ కలసి అర్జునుణ్ణి ఎదిరించారు. అర్జునుడికి అండగా అభిమన్యుడు వచ్చి అందరితోనూ ఒక్కసారిగా పోర నారంభించాడు. భీష్ముడు అభిమన్యుణ్ణి తప్పించుకుని అర్జునుడితో తలపడ్డాడు. ఇద్దరికీ తీవ్రమైన యుద్ధం జరిగింది.

ఈలోపల అశ్వత్థామా, భూరిశ్రవుడూ, శల్యుడూ, చిత్రసేనుడూ, సాంయమని అనే వాడి కొడుకూ—ఈ అయిదుగురు కౌరవ యోధులూ అభిమన్యుడిపై తలపడి యుద్ధం సాగించారు. అభిమన్యుడు విజృంభించి అందరితోనూ యుద్ధంచెయ్యటం చూసి అర్జునుడు ఉత్సాహంతో శంఖం పూరించాడు. అయిదుగురు యోధులు ఏకమైకూడా అభిమన్యుని ధాటిని ఆపలేకపోయారు.

అప్పుడు దుర్యోధనుడు పంపగా త్రిగర్తులూ, మద్రులూ, కేకయులూ ఏకమై, ఇరవైఅయిదువేల సంఖ్యలో వచ్చి అర్జున అభిమన్యులను చుట్టుముట్టారు. ఇది చూసి మండిపడి పాండవ సేనాని అయిన ధృష్టద్యుమ్నుడు అంతులేని బలాలతో వచ్చి శత్రువులను ఎదుర్కొన్నాడు. కృపుడూ, కృతవర్మా మొదలైన కౌరవ యోధులు ధృష్టద్యుమ్నుడి బాణాలకు గురిఅయారు. ఈవిధంగా ధృష్టద్యుమ్నుడు విజృంభించటం చూసి సాంయమని కొడుకుకు రోషం

వచ్చి, వాడు ధృష్టద్యుమ్నుడిపైనా, సారథి పైనా బాణాలు వేస్తూ మీదికి వచ్చాడు.

ధృష్టద్యుమ్నుడు ఒక్క బాణంతో వాడి విల్లు విరగగొట్టి, తరవాత క్షణంలోనే వాడి రథం గుర్రాలనూ, సారథినీ చంపేశాడు. సాంయమని కొడుకు కత్తి దూసి ధృష్ట ద్యుమ్నుడిపైకి వచ్చాడు. ధృష్టద్యుమ్నుడు వాణ్ణి దగ్గిరికి రానిచ్చి తన గదతో గట్టిగా కొట్టాడు. సాంయమని కొడుకు అలాగే చచ్చి పడిపోయాడు.




ఇది చూసి రోషంతో సాంయమనీ, శల్యుడూ ధృష్టద్యుమ్నుడిపై కలియబడి ఘోరంగా యుద్ధం చేశారు. రెండు గడి యల పాటు సమయుద్ధం జరిగినాక శల్యు డిది పైచెయ్యిగా కనబడింది. అంతలో అభి మన్యుడు వచ్చి శల్యుణ్ణి ఎదుర్కొని ఆయ నను తీవ్రమైన బాణాలతో కొట్టసాగాడు. శల్యుణ్ణి రక్షించటానికి దుర్యోధన, దుశ్శా సన, వివింశతి, వికర్ణ, దుర్మర్షణ, దుస్సహ, దుర్ముఖ, చిత్రసేన, సత్యవ్రత, పురుమిత్రు లనేవారంతా వచ్చి అభిమన్యుణ్ణి చుట్టు ముట్టారు. పాండవ పక్షంనుంచి అభిమన్యు డికి అండగా భీముడూ, ధృష్టద్యుమ్నుడూ, ఉపపాండవులూ, నకుల సహదేవులూ వచ్చారు. రెండుపక్షాలా పదేసి యోధులు వీర్పడి చాలాసేపు పట్టుదలతో యుద్ధం సాగించారు. ఈ యుద్ధం చూడటానికి మిగి లినవారు యుద్ధం మానేశారు. శల్యుడు నకుల సహదేవులకు మేనమామే అయి నప్పటికీ వారిమధ్యకూడా క్రూరంగానే యుద్ధం జరిగింది.

యుద్ధం మధ్యలో భీముడు అకస్మా త్తుగా పెద్ద సింహనాదం చేసి, గద తీసుకుని రథం దిగి భీకరంగా శల్యుడిపైకి వెళ్ళాడు. దారిలో అడ్డంవచ్చిన ఏనుగులూ, కాల్బ లమూ అతని గదయొక్క దెబ్బలకు చచ్చి పడటం జరిగింది. అతని భీకరమైన వాలకం చూసి అందరూ నిశ్చేష్టులైపోయారు.

భీముడు ఇలా ముందుకు పోతుంటే వెనక నుంచి ధృష్టద్యుమ్నుడూ, అభిమన్యుడూ మొదలైన పాండవయోధులు అతన్ని తమ బాణాలతో రక్షించారు.

భీముడి దెబ్బలకు బెదిరిన ఏనుగులు సైన్యాన్ని తొక్కుకుంటూ పారిపోయాయి. అటుపైన భీముడు శత్రుసైన్యంలో మృత్యువిహారం చేస్తూ ప్రళయకాల రుద్రుడిలాగా ప్రవర్తించాడు.

చివరకు కౌరవ సైన్యాలు ఎలాటి దుస్థితికి వచ్చాయంటే భీముడు ఏ దిక్కుగా చూస్తే అటుగా ఉన్నవారు భయకంపితులై పారిపోసాగారు.

ఇంతలో భీష్ముడు తన రథంతో భీముడిపైకి వస్తూ అతనిపై అంబుల వర్షం కురిపించాడు. ఈలోగా సాత్యకి భీష్ముణ్ణి ఎదిరించాడు.

సాత్యకి చేసే ప్రళయమైన యుద్ధం ముందు కౌరవయోధు లెవరూ నిలవజాలకుండా ఉన్నస్థితిలో అలంబుసుడనే రాక్షసుడు సాత్యకిని ఎదిరించి వాడుకూడా వెనక్కు తగ్గాడు.

సాత్యకిని ఎదిరించే యోధుడే లేనట్టు కనపడే స్థితిలో భూరిశ్రవుడు సాత్యకిపైకి వచ్చాడు. దుర్యోధనుడూ, అతని తమ్ములూ భూరిశ్రవుడికి అండగా వచ్చారు. అంత



మంది ధృతరాష్ట్రపుత్రులు కంటబడేసరికి భీముడు లేళ్లమందను చూసిన సింహంలాగా అయిపోయి, తన గదతో వారి మీదికి లంఘించాడు.

దుర్యోధనుడూ, అతని తమ్ముడు నందకుడనేవాడూ భీముణ్ణి బాణాలతో గాయపరిచారు. ఇలా కాదనుకుని భీముడు తన రథమెక్కి సారథి అయిన విశోకుడితో, "ఇవాళ ఈ ధృతరాష్ట్రుడి కొడుకులను వరసగా ఎలా చంపుతానో చూస్తూ ఉండు!" అన్నాడు.

భీముడు దుర్యోధననందకుల మీద బాణాలువేశాడు. దుర్యోధనుడు వేసిన బాణాలలో మూడు భీముడి మోచేతికి తగిలి అతని విల్లు కింద పడిపోయింది. భీముడి సారథికికూడా బాణాలు తగిలాయి. భీముడు రోషంతో దుర్యోధనుడి వింటిని ఒక బాణంతో విరగగొట్టాడు. దుర్యోధనుడు మరొక విల్లు తీసుకుని తీవ్రమైన బాణంతో ఎదురురొమ్ములో కొట్టేసరికి భీముడు రథంపై మూర్ఛపోయాడు.

ఇది చూసి అభిమన్యుడు మొదలుగాగల పాండవవీరులు దుర్యోధనుడి రథాన్ని బాణాలలో ముంచేశారు. కాని అంతలోనే స్పృహ తెలిసి భీముడు కౌరవయోధులతో మళ్లీ విలుయుద్ధం సాగించాడు. అతని



దెబ్బలకు తట్టుకోలేక శల్యుడు యుద్ధరంగం నుంచి నిష్క్రమించాడు.

సుషేణుడూ, జలసంధుడూ, సులోచనుడూ, ఉగ్రుడూ, భీమరథుడూ, వీరబాహుడూ, అలోలుపుడూ, దుర్ముఖుడూ, దుష్ప్రధర్షుడూ, వివిత్సుడూ, వికటుడూ, సముడూ అనేవారు—అందరూ ధృతరాష్ట్రుడి కొడుకులే—భీముడిపైకి భయంకరంగా వచ్చిపడ్డారు.

భీముడు వారిలో సగంమందిని వరసగా తన బాణాలతో చంపెయ్యటం చూసి మిగిలినవారు భీముడి బారినుంచి తప్పించుకుని పారిపోయారు.

భీష్ముడు కౌరవవీరులతో, "ఓ యోధులారా, భీముడు ధృతరాష్ట్రుడి కొడుకులనందరినీ పొట్టబెట్టుకుంటున్నాడు. మీరంతా అతణ్ణి చుట్టుముట్టండి!" అని హెచ్చరించాడు.

ఈ హెచ్చరికతో అనేకమంది వీరులు భీముడిపైకి వచ్చారు. వారిలో భగదత్తుడు ఒక గొప్ప ఏనుగు నెక్కివచ్చి భీముణ్ణి బాణవర్షంలో ముంచాడు. ఇందుకు ప్రతిక్రియగా అభిమన్యుడు మొదలైనవారు భగదత్తుణ్ణి బాణవర్షంతో కప్పేసి అతని ఏనుగును గాయపరిచారు. ఆ మదించిన ఏనుగు ఆగ్రహించెంది సైన్యాన్ని కల్లోలపరచ



సాగింది. భగదత్తుడు వేసిన ఒక బాణం రొమ్ములో తగలగా భీముడు తన ధ్వజ స్తంభానికి చేరగిలబడ్డాడు. అదిచూసి విజయగర్వంతో భగదత్తుడు పెద్దగా సింహనాదం చేశాడు.

ఈ సంగతి తెలిసి ఘటోత్కచుడికి మండిపోయింది. వాడు కౌరవుల మదమణచటానికై మాయాయుద్ధానికి దిగాడు. వాడు అకస్మాత్తుగా ఒక మాయ ఐరావతాన్ని ఎక్కి భీకరాకారంతో శత్రువుల మధ్య ప్రత్యక్షమయాడు. వాడి వెనక మిగిలిన దిగ్గజాలు వచ్చాయి. వాటిలో మూడింటిపై ఆయుధాలు కలిగిన రాక్షసులున్నారు.

ఘటోత్కచుడి ఏనుగులు భగదత్తుడి ఏనుగును చుట్టుముట్టి క్రూరంగా హింసించ సాగాయి. ఆ బాధకు తట్టుకోలేక భగదత్తుడి మదపుటేనుగు ఆర్తనాదంచేసింది.

భగదత్తుడు కౌరవసేనానాయకులలో ఒకడు, మహారథుడు. అంతవాడు నిష్కారణంగా ఘటోత్కచుడికి బలి అయిపోతాడన్న భయంతో భీష్ముడు ద్రోణాది కౌరవ యోధులను భగదత్తుడికి రక్షణగా పంపాడు. వారి రాక కనిపెట్టి ధర్మరాజు మొదలైన పాండవులూ, పాంచాలురూ వారిని ఎదిరించ వచ్చారు. ఘటోత్కచుడి విజయధ్వానాలింకా మిన్నుముట్టుతూనే ఉన్నాయి.



భీష్ముడు ద్రోణుడితో, "ఆచార్యా, ఈ రాక్షసుడితో యుద్ధం నాకు చాలా వెగటుగా ఉన్నది. అలసిపోయి ఉన్న మనం ఈ రాక్షసుడితో ఇప్పుడు యుద్ధం చెయ్యలేము. ఇవాళకు మనం యుద్ధం చాలించి వెళ్లి పోదాం!" అన్నాడు.

ఈ మాట కౌరవయోధులకు నచ్చింది. ఘటోత్కచుడితో చేస్తున్న యుద్ధంనుంచి వారు ఉపాయంగా బయటపడి తమ శిబిరాలకు వెళ్లిపోయారు. వారు వెళ్లిపోతుంటే పాండవులు శంఖనాదాలు చేశారు.

తరవాత వారు భీముణ్ణీ, ఘటోత్కచుణ్ణీ ముందుంచుకుని విజయగర్వంతో తమ శిబిరాలు చేరుకున్నారు.

దుర్యోధనుడు తన శిబిరంలో కూచుని, చనిపోయిన తన తమ్ములకోసం కొంతసేపు దుఃఖించి, భీష్ముడివద్దకు వెళ్లి, "తాతా! నీవూ, ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, కృతవర్మా మొదలయినవారంతా మహారథులు గదా, మీరు ఏకమైతే మూడు లోకాలూ నిలవజాలవన్నప్పుడు, ఈ పాండవులు మిమ్మల్ని ఎదిరించి ఎలా గెలవగలుగుతున్నారనుకోవాలి? దీని కేదైనా ప్రత్యేకకారణం ఉంటే చెప్పు! వారు మాటిమాటికీ గెలవటానికి సహాయభూతంగా ఉన్నదేమిటి?" అని అడిగాడు.

"ఈ ప్రశ్నకు సమాధానం నీకూ తెలుసు. పాండవులతో యుద్ధం వద్దు, సంధి చేసుకొమ్మని నేను ఎన్నిసార్లో చెప్పాను. వారు ఎవరికీ ఎన్నడూ కీడు చేసినవారుకారు. అదీ గాక వారి పక్షాన శ్రీకృష్ణుడున్నాడు. అతను వారికి అండగా ఉండగా వారి నెవరూ చంపలేరు. అర్జునుడూ, కృష్ణుడూ నరనారాయణుల అవతారాలని తెలిసినవారు చెబుతున్నారు!" అన్నాడు భీష్ముడు.

దుర్యోధనుడు భీష్ముడికి నమస్కారం చేసి సెలవు పుచ్చుకుని తన శిబిరానికి వెళ్లి పడుకున్నాడు.





# జ్వాలాద్వీపం

నర్మదానదీ తీరాన గల ధవళగిరి రాజ్యాన్ని తారకేశ్వరుడనే రాజు పరిపాలిస్తూండేవాడు. ఆయనకు ఇద్దరు కుమారులు. పెద్దవాడి పేరు శూరసేనుడు; అతడికి పాతికేళ్ల వయసు. చిన్నవాడు పద్దెనిమిదేళ్ళవాడు; పేరు చిత్రసేనుడు.

ఈ ఇద్దరు రాజకుమారులూ ఒకనాటి ఉదయం పరివారాన్ని వెంటబెట్టుకుని, వినోదార్థం వేటకై అడవికి వెళ్లారు. అడవిలో కొంతదూరం పోయిన తరవాత, వాళ్లకు ఒక లేళ్లమంద కనిపించింది. రాజకుమారులిద్దరూ తమతమ గుర్రాలను అదిలించి, ఆ లేళ్ల గుంపుపై బాణాలు ప్రయోగిస్తూ, క్రమంగా తమ పరివారాన్నుంచి వేరుపడి అడవిలో చాలాదూరం వెళ్లిపోయారు.

హఠాత్తుగా వారికి ఒక పొద చాటునుంచి సింహం గర్జించిన ధ్వని వినబడింది. రాజకుమారులిద్దరూ, ఆ ధ్వని వచ్చిన వైపుకు తలలు తిప్పి, బాణాలు ఎక్కుపెట్టే లోపలే, రెండు సింహాలు గర్జించుతూ వారికేసి దూకినై. సింహాలను చూస్తూనే, రాజకుమారులు ఎక్కివున్న గుర్రాలు బెదిరి వెనుదిరిగి పారిపోసాగినై.

రాజకుమారులలో చిన్నవాడైన చిత్రసేనుడు ఎక్కివున్న గుర్రం యజమాని ఎంత బలంగా కళ్లెం లాగినా ఆగక, చెట్ల సందునుంచి బాణంలా దూసుకుపోతూ, కొంతసేపటికి ఒకానొక కొండ ప్రాంతాన్ని చేరి, నురగలు కక్కుతూ కింద పడిపోయి ప్రాణాలు విడిచింది.





ఆసరికి చిత్రసేనుడు బాగా అలసిపోయి వున్నాడు. అతడు తన అన్నకోసం నలుమూలలా పరికించి చూశాడు. ఎక్కడా అతడి జాడ కనిపించలేదు. తను పరివారాన్ని వదిలి అడవిలో చాలాదూరం వచ్చినట్టు అతడికి తోచింది. ఆ ప్రాంతమంతా ఆకాశాన్నంటుతున్న పెద్దపెద్ద మానులతో, చీకటిమయంగా వున్నది. చెట్ల కొమ్మల్లో కోతులూ, రకరకాల పక్షులూ, ఊడల్లా వేలాడుతున్న పెద్ద సర్పాలూ అతడికి కనిపించినై.

ఈ పరిసరాలను చూసి చిత్రసేనుడు చాలా భయపడ్డాడు. తను పరివారాన్నుంచే కాక, మానవ నివాసాలుండే ప్రాంతాలకూడా దూరమైపోయినట్టు అతడు గ్రహించాడు. తను ధవళగిరి నగరాన్ని చేరాలంటే కాలినడకనే వెళ్ళాలి. ఆ నగరం ఏ దిక్కుగా వున్నదో కూడా ఆ క్షణంలో అతడికి తెలియదు.

చిత్రసేనుడు తన విషాద పరిస్థితికి వగుస్తూ, ఉన్నచోటునుంచి కదిలి, అడవిలో కొద్ది దూరం నడిచేసరికి, చిన్నచిన్న తుప్పలతో, పొదలతో నిండివున్న ఒక కొండ అతడికి ఎదురుగా కనిపించింది. ఆ కొండ పాదంలో చిన్న వాగొకటి ప్రవహిస్తున్నది. వాగులోని నీటిని చూడగానే, చిత్రసేనుడికి దాహంతో తన నాలుక పిడచకట్టుకుపోయి వుండటం తెలిసివచ్చింది. అతడు వాగులో దిగి దాహం తీర్చుకున్నాడు.

దాహం తీర్చుకోగానే చిత్రసేనుడు కొంత సేదదేరాడు. అతడు వాగు ఒడ్డునే కూర్చుని ముందు కర్తవ్యం గురించి ఆలోచించసాగాడు. బహుశా తన అన్న శూరసేనుడు కూడా తనలాగే, సింహాల వాత పడకుండా తప్పించుకుని వుంటాడు. బెదిరి పరిగెత్తిన అతడి గుర్రంకూడా, అతణ్ణి యీప్రాంతాలకే తెచ్చి వుండవొచ్చన్న అనుమానం చిత్రసేనుడికి కలిగింది.







ఆ వెంటనే అతడు వాగు ఒడ్డున లేచి నిలబడి, ఎలుగెత్తి పెద్దగా, "అన్నా, శూర సేనా!" అని కేక పెట్టాడు.

చిత్రసేనుడి కేక చెట్లలో, కొండ గుహల్లో మార్మోగిన మరుక్షణాన, వాగు అవతల వున్న ఒక గుహలోనుంచి, "ఎవరూ? ఈ ప్రాంతాల మానవ కంఠస్వరం పలికిందా! ఎంత అదృష్టవంతుడివిరా నాయనా, ఒకసారి నా దగ్గిరకు రా!" అన్న పిలుపు చిత్రసేనుడికి వినిపించింది.

గుహలోనుంచి వచ్చిన ఆ పిలుపు వింటూనే చిత్రసేనుడు తుళ్లిపడి, అంతలోనే ధైర్యం తెచ్చుకుని, ఖంగుమనే కంఠ స్వరంతో, "ఎవరు నీవు? రాక్షసుడివా? లేక నరమాంస భక్షకుడివైన కిరాతుడివా? గుహ నుంచి బయటికి రా, నా కత్తికి ఎరచే స్తాను," అన్నాడు.

చిత్రసేనుడు మాటలు ముగించక ముందే, గుహలోనుంచి చిత్రమైన నవ్వూ, ఆ వెంటనే, "ఎంత సాహసివిరా, వత్సా! నీవంటి ధైర్యశాలికోసమే నేను ఎదురు చూస్తున్నాను. నేను మనిషిమాంసం తినే కిరాతుణ్ణీ కాదు, రాక్షసుణ్ణీ కాదు, ఒకానొక సిద్ధుణ్ణి. నేను ఇంతకాలంగా శ్రమలకోర్చి సంపాయించిన ఒక అమూల్య వస్తువును నీకివ్వబోతున్నాను," అన్న మాటలూ వినిపించినై.

చిత్రసేనుడు చిటికలమీద ఓ నిర్ణయానికి వచ్చాడు. ఆ గుహలో వున్నది రాక్షసుడే అయితే, తను యిక్కణ్ణుంచి ప్రాణాలతో ఎలానూ తప్పించుకుపోలేడు. కనక, రాక్షసు డితో పోరాడుతూ ప్రాణాలు వదలటమే క్షత్రియధర్మం అనుకున్నాడు. ఒక వేళ గుహలో వున్నది నిజంగా సిద్ధుడే అయితే, తనకు కలగబోయే కీడు ఏమీ వుండదు.

ఈ నిశ్చయానికి రాగానే చిత్రసేనుడు ఒరనుంచి కత్తిదూసి, మోకాటి లోతున్న వాగునీటిలో దిగి అవతలి ఒడ్డుకు చేరాడు.





అతడు గుహమధ్య ఒక ఎత్తయిన వేదిక మీద కూర్చునివున్నాడు. గుహ పైభాగాన వున్న కంతలనుంచి సూర్యకాంతి లోపల పడుతూండడంవల్ల, గుహ లోపలిభాగం వెలుతురుగా వున్నది.

ముసలి సిద్ధుణ్ణి చూస్తూనే చిత్రసేనుడు తను అంతకుముందు పరుషంగా మాట్లాడి నందుకు నొచ్చుకున్నాడు. అతడు కత్తిని ఒరలో పెట్టి, సిద్ధుణ్ణి సమీపించి నమస్కరిస్తూ, "మహాత్మా, నన్ను క్షమించవలసిందిగా వేడుతున్నాను," అన్నాడు ఎంతో వినయంగా.

అక్కడ కొండలో చాలా గుహలున్నవి. అందువల్ల తనను పిలిచిన వ్యక్తి ఏ గుహలో వున్నదీ చిత్రసేనుడికి తెలియరాలేదు. అతడు ఒక్కొక్క గుహదగ్గిరకు వెళ్ళి లోపలికి తొంగి చూడసాగాడు. అంతలో అతడికి దాపులనున్న ఒక గుహనుంచి, "నాయనా, భయపడకు. ఇటు రా!" అన్న మాటలు వినిపించినై.

చిత్రసేనుడు కత్తిని మరింత గట్టిగా గుప్పెట బిగించి, ఆ పిలుపు వచ్చిన గుహ ముందుకు వెళ్ళి లోపలికి తొంగి చూశాడు. గుహలో అతడికి ఒక సిద్ధుడు కనిపించాడు. అతడి తలా గడ్డమూ తెల్లగా నెరిసివున్నవి.

చిత్రసేనుడి మాటలకు సిద్ధుడు చిరునవ్వు నవ్వి, "నాయనా, నువ్వు సుక్షత్రియుడివిలా కనబడుతున్నావు. అరవై సంవత్సరాల నా తపశ్శక్తినంతా ధారపోసి ఒక అపూర్వ వస్తువును సాధించాను. కాని, దాన్ని అనుభవించే యోగ్యత నాకు లేదు. నేను దాన్ని సాధించే ప్రయత్నంలో ముసలివాణ్ణయిపోయాను. నాకీరాత్రి అష్టమి చంద్రుడు అస్తమించే సమయాన మరణం సిద్ధించనున్నది. నేను యిన్ని శ్రమలకోర్చి సాధించిన ఆ అపూర్వ వస్తువును యోగ్యుడైనవాడికెవడికైనా యిచ్చిపోదామని చాలా రోజులుగా చూస్తున్నాను. నా తుది





ఘడియల్లో నీ అదృష్టం నిన్ను నా దగ్గిరకు లాక్కువచ్చింది. ఇదుగో, ఆ అపూర్వ వస్తువు!" అంటూ పక్కనే వున్న ఒక వెదురు బుట్టను చిత్రసేనుడికి యిచ్చాడు.

చిత్రసేనుడు సిద్ధుడినుంచి బుట్ట అందుకుని ఆత్రంగా దాని మూతను తెరవబోయేంతలో, సిద్ధుడు తన దండంతో బుట్టమూతను గట్టిగా అదిమి, "నాయనా, తొందరపడి బుట్ట మూతను యిక్కడ తెరవకు. నీవు ఏ ప్రాంతాల అయితే నివసించటానికి మక్కువ పడతావో, ఆ ప్రాంతాన దాన్ని తెరిచి చూడటం నీకు క్షేమకారణం అవుతుంది," అన్నాడు.

చిత్రసేనుడు సిద్ధుడు చెప్పినదానికి అంగీకార సూచకంగా తలాడించి, "మహాత్మా, మీ దయకు కృతజ్ఞుణ్ణి. నానుంచి మీరు ఎలాంటి సేవా శుశ్రూషలు కోరినా, చేయటానికి సిద్ధంగా వున్నాను," అన్నాడు.

ఈ మాటలకు సిద్ధుడు నవ్వి, "నాయనా, నీ నమ్రతా, భక్తీ చూసి నాకు చాలా ఆనందం కలుగుతున్నది. ఇక కొద్ది ఘడియల్లోనే నేను మరణించబోతున్నాను. అలాంటి నాకు నీవు చేయగల సేవ ఏమీ లేదు. కాని, నీకు ఒక్క చిన్న పనిమాత్రం చెపుతున్నాను. నీవు గుహనుంచి బయటికి



వెళ్ళింతరవాత, గుహకు తూర్పువైపున కోణాకృతిలో వున్న రాతిని కిందకు లాగు. అదే నీవు చేయగల ప్రత్యుపకారం," అన్నాడు.

చిత్రసేనుడు సిద్ధుడికి నమస్కరించి గుహనుంచి బయటికి వచ్చి, అతడు చెప్పిన రాతిని రెండు చేతులతోనూ బలంగా పట్టి కిందకు లాగాడు. వెంటనే కొండ దద్దరిల్లేలా పెద్ద చప్పుడయింది. గుహ ముందుభాగాన్ని, పైనుంచి జారి పడిన ఒక బల్లపరుపు రాయి గుర్తు తెలియని విధంగా కప్పేసింది.

చిత్రసేనుడు అక్కడ కొద్దిసేపు నిలబడి తరవాత వాగు దాటి అరణ్యంలో ప్రవేశించాడు. తను నగరం చేరాలంటే ఏ దిక్కుగా

పోవాలో అతడికి తెలియదు. ఆ కారణంగా అతడు చెట్లలో సునాయాసంగా నడవటానికి అనువైన మార్గాలగుండా నడవసాగాడు. ఇలా కొంతసేపు నడిచేసరికి సూర్యుడు పడమటి దిక్కుకు వాలటం కనిపించింది. క్రమంగా అతణ్ణి ఆకలి దహించసాగింది.

ఆయాసపడుతూ చిత్రసేనుడు అడవిలో మరికొంతదూరం నడిచి, అంతగా చెట్లులేని ఒక ఎత్తయిన ప్రదేశాన్ని చేరాడు. అక్కడ కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నతరవాత, హఠాత్తుగా అతడి దృష్టి భుజాన వేలాడుతున్న బుట్టమీదికి ప్రసరించింది. అందులో వున్నదని సిద్ధుడు చెప్పిన అపూర్వ వస్తువేమిటో చూడాలన్న కోర్కె అతడికి కలిగింది. ఆ క్షణాన చిత్రసేనుడికి సిద్ధుడు చేసిన హెచ్చరిక గుర్తుకు రాలేదు.

అతడు భుజాన్నుంచి బుట్టను కిందికి దించి, దాని మూతను పైకెత్తి ఆత్రంగా లోపలికి చూశాడు. వెంటనే అతడి కళ్ళలో మెరుపు మెరిసినట్టయింది. చిత్రసేనుడు కళ్లు మూసి తిరిగి తెరిచేసరికి, ఎదురుగా చెట్లలో ఆకాశాన్నంటుతున్నట్టున్న పెద్ద భవనం ఒకటి కనిపించింది.

ఈ అద్భుత దృశ్యం చూసి చిత్రసేనుడు శిలాప్రతిమలా అయిపోయాడు. ఆ మరుక్షణం అతడికి సిద్ధుడు చేసిన హెచ్చరిక





గుర్తుకొచ్చింది. "అయ్యో, నేనెంత మూర్ఖుణ్ణి! ఈ మహారణ్యం మధ్య, ఈ దివ్యభవనం నాకెందుకు పనికివస్తుంది? ఇదే ధవళగిరి నగరంలో వున్నట్టయితే ఎంతగా రాణించేది! నా బుద్ధిహీనతవల్ల, సిద్ధుడు చేసిన యింత మేలూ అరణ్యంపాలు చేశానే!" అంటూ దుఃఖపడసాగాడు.

ఆ స్థితిలో వున్న చిత్రసేనుడికి అరణ్యం మధ్యనుంచి పెడబొబ్బలు వినిపించినై. చూస్తూండగానే చెట్లు పెనుగాలి తగిలినట్టు వూగసాగినై. చిత్రసేనుడు ఆశ్చర్యపడుతూ చుట్టూ చూసేంతలో, అడ్డంవచ్చిన పెద్ద పెద్ద చెట్లను చేతులతో పడదోస్తూ, ఒక రాక్షసుడు అతడికేసి రావటం కనిపించింది. చిత్రసేనుడు లేచి నిలబడి కత్తిదూశాడు.

రాక్షసుడు వికటాట్టహాసం చేస్తూ అతణ్ణి సమీపించి, "ఏమిరా కుర్రా, నీ ధైర్య సాహసం! ఈ ఉగ్రాకృణ్ణి చూస్తూనే, నర మానవుడైనవాడు ప్రాణాలు వదలటం ఎరుగుదును గాని, నీలా కత్తి దూసి నిలబడ్డవాడు ఈనాటివరకూ నాకు తారసపడలేదు," అంటూ వెనుదిరిగి వింత భవనంకేసి చూస్తూ, "ఆ బొమ్మరిల్లు నీవు కట్టిందేనా?" అని ప్రశ్నించాడు.

"అవును," అన్నాడు చిత్రసేనుడు తొణక్కుండా.



ఆ ప్రత్యుత్తరం వింటూనే ఉగ్రాకుడు, 'అహ్హహ్హ' అంటూ చెట్ల ఆకులు రాలి పడేలా నవ్వి, "ఈ అడివిని, నీ ముత్తాత నాటి నీళ్ళు పోసి పెంచాడనా నువ్వనుకునేది? జాగర్త. ఇది ఉగ్రాకుడి అడివి! నా అనుమతిలేకుండా దీనిమధ్య ఇల్లు కట్టావు గనక, నిన్నూ ఆ ఇంటినీ కట్టకట్టి, ఆ కొండ అవతలికి విసిరేస్తాను," అంటూ వంగి చిత్రసేనుణ్ణి పట్టుకోబోయాడు.

చిత్రసేనుడు రాకీసుడికి అందకుండా తప్పుకుని, "తొందరపడకు, ఉగ్రాకా! నేనిక్కడ ఇల్లు కట్టినందువల్ల నీకొచ్చిన నష్టమేమిటి? కావాలంటే, ఆఇల్లు నీకు వదిలి, నా దారిన నేను పోతాను," అన్నాడు.

"అదేం కుదరదు. నా అడివిలో నన్ను ధిక్కరించి ఇల్లు కట్టావు. నీవు ప్రాణాలతో బయట పడాలంటే, నే నడిగేదానికి ఒప్పుకోవాలి," అన్నాడు ఉగ్రాకుడు. "ఏమిటదీ?" అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.

"నువ్వీ ఇంట్లోనే సుఖంగా బతుకు, నా అభ్యంతరం లేదు. నీకు పుట్టబోయే పిల్లల్లో పెద్దవాణ్ణి పద్దెనిమిదో ఏడు రాగానే, నాపరం చెయ్యి," అన్నాడు ఉగ్రాకుడు.

రాకీసుడి కోర్కె చిత్రసేనుడికి చాలా వింతగా కనిపించింది. తనకింకా పెళ్ళే కాలేదు! అలాంటప్పుడు రాకీసుడు అడిగిన దానికి సరేనంటే పోయేదేమిటి? తను కనీసం ప్రాణాలతోనన్నా యిక్కణ్ణుంచి బయటపడవొచ్చు.

చిత్రసేనుడు ఇలా ఆలోచించి, "ఉగ్రాకా, నీ వడిగినదానికి ఒప్పుకుంటున్నాను. నా పెద్దకొడుక్కు పద్దెనిమిదో ఏడు రాగానే, నువ్వొచ్చి వాణ్ణి నిరభ్యంతరంగా తీసుకుపోవచ్చు," అన్నాడు.

రాకీసుడు ఈ ప్రత్యుత్తరం విని పొంగిపోతూ, "అయితే, నిన్ను ప్రాణాలతో వదులుతున్నాను. ఇచ్చినమాట నిలుపుకో," అంటూ వెళ్ళిపోయాడు.

—(ఇంకా వుంది)



# ప్రేమభంగం

విసుగుచెందని విక్రమార్కుడు మరొక సారి చెట్టువద్దకు వెళ్లి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ ఓర్పు అత్యాశ్చర్య కరమైనది. నీవు పడే శ్రమ చూస్తే నాకు జాలి వేస్తున్నది. అందుచేత నీకు శ్రమ తెలియకుండా అంగారవతి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం ఉదయసేనుడు కౌశాంబీ నగరం రాజధానిగా వత్సరాజ్యాన్ని ఏలుతూ ఉండిన కాలంలో లావాణకం అన్నచోట బుద్ధదత్తుడనే ఒక క్షత్రియుడుండేవాడు. అంగారవతి ఆయన కుమార్తె. బుద్ధదత్తుడుండే చోటు దాదాపు నిర్జనప్రాంతం. అందుచేత అంగారవతి తమ ఇల్లూ, దొడ్డీ దాటి ఎక్కడికీ వెళ్లినదికాదు. బంధువులైనా ఎప్పుడో వచ్చి పోయేవారు. అందుచేత



అంగారవతి బాహ్యప్రపంచం ఎరగకుండా పెరిగింది. ఆమె తండ్రికూడా సాధారణంగా ఇల్లు కదిలి వెళ్లేవాడుకాడు. తన దొడ్డిలో ఉండే చెట్లనూ, చేమలనూ చూసుకుంటూ కాలక్షేపం చేసేవాడు.

అంగారవతి పెరిగి పెద్దదై, పెళ్ళాడి ఒకరి ఇంటికి వెళ్లిపోదగిన వయస్సు అందుకున్నది. తనకు ఎలాటి భర్త కావాలో, భర్త ఎటువంటివాడైతే తాను సుఖపడుతుందో కూడా ఆమె ఎరగదు.

ఈ సమయంలో వత్సరాజు సపరివారంగా లావాణకం ప్రాంతానికి వేట నిమిత్తమై వచ్చాడు. ఆయన పరివారంలో చండసేను డనేవాడొకడున్నాడు. అతను ముప్పై ఏళ్ల వయసు గలవాడు. వారి వంశం చాలా ప్రసిద్ధికెక్కినది. అయితే అతను వత్సరాజు కొలువులో చేరి ఎంతోకాలం కాలేదు.

ఒకనాడు చండసేనుడు అరణ్యమార్గాన నడుస్తూ బుద్ధదత్తుడి ఇంటిముందుగా వచ్చి అంగారవతిని చూశాడు. వెంటనే అతనికి ఆమెను పెళ్లాడాలన్న కోరిక కలిగింది. చండసేనుడు బుద్ధదత్తుడి పరిచయం చేసుకుని, తన కుల గోత్రాలను తెలుపుకుని, అంగారవతి కింకా వివాహం కాలేదని రూఢి చేసుకుని, తన మనసులో ఉన్న మాట కాస్తా ఆయనతో చెప్పేశాడు.

చండసేనుడు తన కుమార్తెను పెళ్లాడగోరుతున్నాడని విని బుద్ధదత్తుడు ఆశ్చర్యమూ, ఆనందమూకూడా పొందాడు. ఎందుకంటే తాను తన కుమార్తెకు తగిన వరుణ్ణి వెతకవలసిన అవసరం తప్పటం అటుంచి, తాను నూరేళ్లు వెతికినా అంత మంచి సంబంధం తీసుకురాలేడు. చండసేనుడు గొప్ప కులీనుడు, పైపెచ్చు వత్సరాజైన ఉదయనుడి కొలువులో ఉంటున్నాడు. ఇంతకాలమూ చెట్లచేమల మధ్య జీవించిన తన కూతురు అంగారవతి ఇతన్ని పెళ్లాడి కాపరానికి వెళితే, కౌశాంబీ నగ

రంలో నాగరిక జీవితం జీవించి ఎంతో సుఖపడుతుంది.

చండసేనుణ్ణి చూసి అంగారవతి ఉబ్బి తబ్బిబ్బు కాలేదు గాని, అతన్ని చేసుకోవటం మంచిదని తండ్రి చెప్పిన సలహాను పూర్తిగా విశ్వసించింది. అలాటి భర్త తనకు దొరకటం నిజంగా తన అదృష్టమేననికూడా ఆమె నమ్మింది.

వారంరోజులు గడిచాక చండసేనుడు కౌశాంబీ నగరానికి తిరిగి వెళ్ళిపోతూ, బుద్ధదత్తుడి ఇంటికి వెళ్ళి, "నేను ఇంటికి తిరిగి పోతున్నాను. పెళ్ళి సంగతి నా బంధుమిత్రులందరికీ తెలిపి, ముహూర్తం పెట్టించి మీకు కబురుచేస్తాను. అప్పుడు పెళ్ళి ప్రయత్నాలు చేద్దురుగాని!" అన్నాడు.

చండసేనుడు వెళ్ళిపోయాక అంగారవతి అతన్ని గురించి ఆలోచించటం మానేసింది. తనకు మంచి సంబంధం దొరికిందని ఆమె పూర్తిగా నమ్మినప్పటికీ అంగారవతి ఆ చండసేనుణ్ణి నిజంగా ప్రేమించలేదు. నిజానికి ఆమెకు అప్పటిదాకా ఎవరిపైనా ప్రేమభావమన్నది లేదు.

వారాలూ, నెలలూ గడిచిపోయాయి. చండసేనుడినుంచి ఎలాటి వర్తమానమూ లేదు. అతను తనను పెళ్ళాడే సంకల్పాన్ని




మార్చుకున్నాడని అంగారవతి అనుకున్నది. అలా అనుకోవటంవల్ల ఆమెకు కొంచెంకూడా నిరాశ కలగలేదు. తనలాగా సామాన్య జీవితం గడిపిన మనిషి అంత గొప్పవాణ్ణి పెళ్ళాడటం మంచిది కాదేమోనని ఆమెకు ఒకపక్క కొంత సందేహంకూడా ఉన్నది.

బుద్ధదత్తుడు మాత్రం చండసేనుడి యందు పూర్తి విశ్వాసం ఉంచాడు. "వారి వంశం ఎటువంటిది! ఆ వంశంలోవాళ్ళు ప్రాణాలైనా విడుస్తారుగాని ఆడి తప్పుతారా?" అన్నాడాయన.

ఈలోపుగా కౌశాంబీలో చాలా సంఘటనలు జరిగాయి. ఉదయనుడి మంత్రి

అయిన యౌగంధరాయణుడు తన చాణక్య ప్రజ్ఞచేత మగధరాజు కూతురు వాసవ దత్తను తెచ్చి తన రాజుకు పెళ్లిచేసి, వారి వంశాల మధ్య అనాదిగా ఉన్న శత్రుత్వానికి విరుగుడు వేశాడు. ఆ తరవాత యౌగంధరాయణుడు ఉదయన మహారాజు చేత దిగ్విజయం ఆరంభింపజేశాడు. మగధ నుంచి కొన్ని సైన్యాలు వచ్చి లావాణకంలో విడిశాయి.

ఒకనాడు అంగారవతి గుమ్మంలో నిలబడి ఉండగా వారి ఇంటి ముందుగా ఒక సైనికుడు వెళ్లాడు. అతని వయసు ఇరవై అయిదు లోపు; చాలా అందగాడుగా ఉన్నాడు, అయినా అతని ముఖంలో అంగారవతికి ఏదో విషాదచ్ఛాయ కనిపించింది. మొట్టమొదటిసారిగా అంగారవతి ఆ సైనికుణ్ణి ప్రేమించింది. అతనుకూడా ఆమెను ప్రేమించాడు. అందుచేత అతను ఆమెకేసి చూసి ఆనందం పొందగలందులకై రోజూ బుద్ధదత్తుడి ఇంటి ముందుగా నడవసాగాడు.

ఒకనాడు అంగారవతి వీధి గుమ్మంలో నిలబడి ఉండగా ఆ సైనికుడు అటుగా వెళుతూ ఆగి ఆమెను పలకరించాడు. ఆమె అతనితో మాట్లాడింది. అతని పేరు శతానీకుడు. అతనిది ఉజ్జయినీ నగరం.



ఒక్క ముసలితల్లి తప్ప అతనికి ఇంకెవరూ లేరు. అతను మగధరాజు కొలువులో వుంటూ తల్లికి శుశ్రూష చేస్తూండేవాడు. అలాటి పరిస్థితిలో అతను మగధరాజు ఆజ్ఞానుసారం ఆయన అల్లుడైన ఉదయన మహారాజు సాగించే దిగ్విజయంలో సైనికుడుగా చేరి, తల్లికి దూరం అయాడు.

"ఈ దిక్కుమాలిన అరణ్యంలో జీవిస్తున్నాను. మా అమ్మ అక్కడ ఎలా ఉన్నదో అని రాత్రింబగళ్లు దిగులుతో చచ్చిపోతున్నాను. ఉదయనమహారాజుకోసం ఏయే దేశాలకు వెళ్లి యుద్ధం చెయ్యాలో, ఈ యుద్ధాలనుంచి నేను ప్రాణాలతో బయటపడతానో, పడనో, ఒకవేళ బయటపడినా నేను తిరిగివచ్చేదాకా నా తల్లి జీవించి ఉంటుందో, ఉండదో, అంతా అయోమయంగా ఉన్నది. ఒక్కొక్కసారి ఆత్మహత్య చేసుకుందామన్నంత గుబులుగా ఉంటుంది. నిన్ను చూసినప్పటినుంచీ నా దిగులు చాలాభాగం తగ్గిపోయిందీ. అంధకారంలో మెరుపులాగా నాకు నీవు కనిపించావు!" అన్నాడు శతానీకుడు.

అతని కథ విన్నాక అంగారవతికి అతనిపై ఉన్న ప్రేమ రెట్టింపు అయింది. అప్పటికే ఆమె తనను పెళ్లాడే ప్రయత్నాన్ని చండసేనుడు విరమించుకున్నాడని నిశ్చ





యించుకున్నది. ఈ శతానీకుడు తనను పెళ్లాడేపక్షంలో ఆమెకు ఎలాటి అభ్యంతరమూ లేదు. అయితే అలాటి సామాన్య సైనికుణ్ణి తాను పెళ్లాడతానంటే తండ్రి ఎంతమాత్రమూ ఒప్పడు.

ఒకనాడు శతానీకుడు ఎంతో తత్తరపాటుతో వచ్చి అంగారవతితో, "చూడు, అంగారవతీ! నేనొక నిశ్చయం చేసుకున్నాను. ఇవాళ రాత్రే నేను ఎవరికీ చెప్పకుండా మగధకు బయలుదేరి పోతున్నాను. నాకీ సైనికుడి కొలువు అక్కర్లేదు అంతగా అయితే కట్టెలు కొట్టుకుని బతుకుతాను. నీవుకూడా నా వెంట వచ్చేస్తావా? మనం పెళ్లాడదాం. మా అమ్మ నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తుంది. నిన్నూ, నన్నూ చూసుకుంటూ ఆవిడ హాయిగా నూరేళ్లు జీవిస్తుంది!" అన్నాడు.

అంగారవతి చాలాసేపు తనలో తాను వితర్కించుకుని చివరకు సరే నన్నది.

"ఈ రాత్రి రెండో జాములో నువు ఈ దారి ఎగువ నున్న మర్రిచెట్టుకింద వచ్చి ఉండు. నేను వచ్చి నిన్ను కలుసుకుంటాను. తరవాత మనిద్దరమూ కలిసి వెళ్లిపోదాం!" అన్నాడు శతానీకుడు.

ఆ రాత్రి అంగారవతి తండ్రిని నిద్రపోనిచ్చి తన చీరెలూ, వస్తువులూ కొద్దిగా తీసి చిన్నమూట గట్టుకుని రెండవ జాములో ఇల్లు వదిలి శతానీకుడు చెప్పిన మర్రి చెట్టును చేరుకుని, దాని అడుగుభాగంలో ఉన్న తొర్రలో దూరి దాక్కున్నది.

తరవాత కొద్దిసేపటికే అటుగా ఇద్దరు మనుషులు మాట్లాడుకుంటూ వచ్చారు. వారు దగ్గిరికి వచ్చినాక వారిలో ఒకడు చండసేనుడని అంగారవతి గుర్తించింది.

చండసేనుడు తనవెంట ఉన్నవాడితో, "ఈ దారి ఇంకొంచెం అవతలగా చీలుతుంది. ఎడమచేతివైపు వెళితే బుద్ధదత్తుడిగా రిల్లు వస్తుంది. కాని మనం కుడిచేతి

వైపుగా వెళితే అక్కడ ఒక పాడుపడిన కోవెల ఉన్నది. తెల్లవారినదాకా అక్కడ గడిపి తరవాత బుద్ధదత్తుడుగారింటికి పోదాం. ఇంతకాలంగా నానుంచి వర్తమానం రాక, పాపం, వారు నన్ను గురించి ఎలాటి అపోహలుపడుతున్నారో తెలియదు," అనటం అంగారవతి విన్నది.

ఆ మనుషులిద్దరూ కోవెల దారి పట్టటంకూడా ఆమె గమనించింది. తరవాత కొద్దిసేపటికే శతానీకుడు వచ్చి చిన్నగా, "అంగారవతీ!" అని పిలిచాడు.

ఆమె చెట్టుతొర్రలోనుంచి బయటికి వచ్చి, "నేను నీవెంట రాలేను. నన్ను క్షమించు. ఈ మాట చెబుదామనే నీకోసం యిక్కడ వేచి ఉన్నాను. నీ కోరిక తీర్చలేనందుకు నన్ను మన్నించు!" అంటూ కంట నీరు పెట్టింది.

శతానీకుడు ఆమెపై ఆగ్రహించలేదు. ఆమెను ప్రశ్నించలేదు. "నా వెంట వచ్చి నన్ను పెళ్లాడటం నీకు నిజంగా అసాధ్యమా?" అని మాత్రం అడిగాడు.

"నిజంగా అసాధ్యమే. ఏ మాత్రం సాధ్యమైనా మానేస్తానా?" అన్నది అంగారవతి.

శతానీకుడు ఒక్క నిట్టూర్పు విడిచి తన దారిన తాను సాగిపోయాడు. అంగా



రవతి వచ్చినట్టుగానే తన ఇంటికి తిరిగి పోయింది. మర్నాడు చండసేనుడు వారి ఇంటికి వచ్చి, తనకు రాజుగారు అప్పుడే మాన్యం ఏర్పాటు చేశారనీ, అంతదాకా తనకు భార్యను పోషించేపాటి శక్తికూడా లేదనీ చెప్పాడు.

ఈసంగతివిని బుద్ధదత్తుడు చాలా సంతోషించాడు. చండసేనుడు అంగారవతిని పెళ్లాడి కౌశాంబీనగరానికి తీసుకుపోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, అంగారవతి శతానీకుణ్ణి ఎందుకు పెళ్లాడలేదు? ఆమెకు అతనిపై ఉన్నది నిజమైన ప్రేమ కాకనా? లేక చండసేనుణ్ణి పెళ్లాడితే తనకు మరింత పరువు ప్రతిష్టలూ, భోగభాగ్యాలూ లభిస్తాయనా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అంగారవతిలో స్వార్థం లేదు. ఉన్నట్టయితే ఆమె ఒక పేద సైనికుణ్ణి పెళ్లాడటానికి సిద్ధపడదు. స్వార్థం లేనివాళ్లు ఎన్నడూ ప్రేమకోసం తమ ధర్మాన్ని త్యాగం చెయ్యలేరు. అంగారవతి సంగతి అదే అయింది. ఆమె శతానీకుణ్ణి ప్రేమించింది; అయితే ఆ ప్రేమ ఆమెకు మాత్రమే సంబంధించినది. అంగారవతి ధర్మం చండసేనుణ్ణి పెళ్లాడటం. ఈ ధర్మం తనకే గాక తన తండ్రికీ, వంశాచారానికీ, లోకానికీ సంబంధించినది. ఆమె తన ప్రేమను త్యాగం చెయ్యాలా, ధర్మాన్ని త్యాగం చెయ్యాలా అన్న సమస్య ఏర్పడే సరికి, తడుపుకోకుండా తన ప్రేమను త్యాగంచేసి ధర్మాన్ని నిలబెట్టుకున్నది. అందుచేత ఆమె చండసేనుణ్ణి పెళ్లాడింది పరువు ప్రతిష్టలకోసమూ, భోగభాగ్యాల కోసమూ కానేకాదు!" అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# న్యాయబుద్ధి కలవాడు

తవొర్పుచైనాలో ఒక నూలు వ్యాపారి ఉండే వాడు. ఆయనవద్ద ఒక లక్ష ధనం ఉండేది. ఆయన వయసు అరవై. భార్య పోయింది. బిడ్డలు లేరు. "నావద్ద లక్ష ఉండి ఏం లాభం? అనుభవించటానికి పిల్లా పీచూ లేరాయె!" అని అస్తమానం అంటూండేవాడు.

ఆయనకు మళ్ళీ పెళ్ళాడాలని ఉన్నదని గుర్తించి ఇద్దరు పెళ్ళిళ్ళ పేరక్కలు మంచి సంబంధం తెస్తామని ఆయనకు ఆశపెట్టారు. పిల్ల అందంగా ఉండాలనీ, గొప్పయింటి మర్యాదలు తెలిసినదై ఉండాలనీ ముసలాడు పట్టుపట్టాడు.

పెళ్ళిళ్ళ పేరక్కలు ముసలాడికి ఒక చక్కని చుక్కను చూశారు. ఆమె మంత్రిగారి ఇంటి నౌకరు. చిన్నతనంనుంచీ ప్రతిష్ఠ గలచోట మసిలి మాన మార్యాదలన్నీ బాగా తెలిసిన మనిషి. చాలా అందగత్తె. ఆమెతో పెళ్ళిళ్ళ పేరక్కలు, "నీ కాబోయే భర్త లక్షాధికారి, సలభైఏళ్ళవాడు. స్వభావంకూడా మంచిది," అని చెప్పారు.

పెళ్ళి అయి కాపరానికి వచ్చాకనే ఆ పిల్ల తన భర్తను చూసి, ఆయన ముసలివాడని తెలుసుకుని విచారపడింది. కాని చేసేదేమీ లేక ఊరుకున్నది.

ఒకనాడు ముసలాడు వ్యాపారంమీద పొరుగూరు వెళ్ళాడు. ఆ సాయంకాలం దాసీది తన యజమానురాలితో, "అమ్మా, మనం అలా బయటికి వెళ్ళి వద్దామా? ఎక్కడికీ కదలకుండా ఇంట్లో కూచుంటే ఏం పొద్దు పోతుంది?" అన్నది.

ముసలాడి భార్య సరేనని మంచి దుస్తులు వేసుకుని తన దాసీదానితో ఇంటి బయటికి అడుగుపెట్టింది. ఇంటికి పక్కనే ముసలాడి దుకాణం ఉన్నది. అందులో నూలూ, కుంకుమా ఉంటాయి. ఆ దుకాణంలో ఇద్దరు గుమాస్తాలుంటారు. వారిలో ఒకడు



యాభైవీళ్ల వయసువాడు, రెండోవాడు చిన్న వాడు, బ్రహ్మచారి.

ఇద్దరు గుమాస్తాలూ తమ యజమానురాలిని చూడగానే లేచి నిలబడి, నమ్రతగా తలలు వంచారు. ఆమె వారిద్దరినీ నవ్వుతూ పలకరించి, "మీరు ఎంతకాలంగా పనిచేస్తున్నారు? మీకు అన్నీ సుఖంగా జరిగిపోతున్నాయా?" అని అడిగింది. ఇద్దరూకూడా తమ కేలోటూ లేదని జవాబు చెప్పారు.

ఆమె మళ్లీ ఇంట్లోకి వెళ్లి కొంత డబ్బు తెచ్చి పెద్దగుమాస్తా చేతిలోనూ, చిన్న గుమాస్తా చేతిలోనూ పెట్టింది. తరవాత ఆమె కాస్సేపు వీధిలో నిలబడి ఇంట్లోకిపోయింది.

యజమానురాలు ఇద్దరు గుమాస్తాలకూ బహుమానాలివ్వటంలో కొంత పక్షపాతం చూపింది. ఆమె పెద్దగుమాస్తాకు పది వెండి నాణాలిచ్చి, చిన్నవాడికి పది బంగారు నాణాలిచ్చింది. ఈ తేడాను వారు గ్రహించలేదు. చిన్న గుమాస్తా చాంగ్ మాత్రం తనకు ముట్టిన బహుమతికి చాలా ఆనందించాడు.

నూలు దుకాణానికి రాత్రల్లా కాపలా ఉండాలి. ఒక రాత్రి పెద్దగుమాస్తా దుకాణంలో పడుకుంటే రెండవరాత్రి చిన్న గుమాస్తా పడుకునేవాడు. చిన్న గుమాస్తా చాంగ్ దుకాణానికి కాపలా పడుకున్న రాత్రి ఎవరో తలుపు తట్టిన చప్పుడయింది. చాంగ్, "ఎవరు వారు?" అని కేక పెడితే యజమానురాలి దాసి, "తలుపు తియ్యి," అన్నది. చాంగ్ తలుపు తీసి, "ఈ వేళప్పుడు నీకేం పని?" అన్నాడు.

"నేను నాపనిమీద రాలేదు. అమ్మగారు పంపారు," అన్నది దాసి

"నాకిచ్చిన పది బంగారు కాసులూ తిరిగి పట్టుకురమ్మన్నారా ఏమిటి?" అని చాంగ్ అడిగాడు.

"అదేం లేదులే. నీకు మరికొన్ని బహుమానాలు!" అంటూ దాసీది తన వీపునుంచి ఒక మూట దింపింది. ఆ మూటలో కొన్ని

కొత్తబట్టలున్నాయి. "ఇవి నీకూ, మీ అమ్మ కూనూ! అన్నట్టు అసలు వస్తువు మరి చాను," అని ఆమె ఒక వెండి ముద్ద, ఒకటి న్నర వీశ బరువు గలది, తన చేతికొంగులో నుంచి తీసి చాంగ్‌కు ఇచ్చి వెళ్ళిపోయింది.

ఈ బహుమతులు చూసి చాంగ్ నిర్ఘాంత పోయాడు. అతనికి ఆ రాత్రి మరి నిద్రపట్ట లేదు. తెల్లవారగానే అతను దుకాణం తెరిచి పెద్దగుమాస్తా రాగానే దుకాణం ఆయనకు వప్పగించి ఇంటికి వెళ్లాడు.

అతను తెచ్చిన బట్టలూ, వెండిముద్దా చూసి చాంగ్ తల్లి, "ఎక్కడివిరా, ఇవన్నీ?" అని అడిగింది. చాంగ్ జరిగిన సంగతి అంతా చెప్పాడు. "మీ యజమానురాలి ఉద్దేశమేమిటి? ఎందుకిలా నీకు బంగారమూ, వెండీ, బట్టలూ ఇస్తుంది. మీ నాయన పోయాక నాకు నువు తప్ప ఇంకెవరూ లేరు, బాబూ! నువు మాత్రం ఇక ఆ యింటికి వెళ్లకు, నీపుణ్యం ఉంటుంది," అన్నది.

చాంగ్ తల్లి చెప్పినదానికి ఏనాడూ విరు ద్ధంగా చేసి ఎరగడు. అతను పనిలోకి వెళ్ళటం మానేశాడు. తన చిన్నగుమాస్తా పనిలోకి రాకపోవటం చూసి యజమాని మనిషిని పంపాడు. "మావాడికి శైత్యా ఛారం చేసి సుస్తీగా ఉంది. కొంచెం నింపా




దిగా ఉంటే వస్తాడు!" అని చాంగ్ తల్లి ఆ మనిషితో చెప్పింది.

మరికొన్ని రోజులయాక పెద్దగుమాస్తా వచ్చి, "మీవాడు ఎప్పుడు పనిలోకి వస్తా డేమిటి? పనంతా ఒక్కణ్ణే చూడలేక సత మతమయిపోతున్నాను," అన్నాడు. ఆయ నతో చాంగ్‌తల్లి, "మావాడికి జబ్బు జాస్తి అయింది," అన్నది.

మరి నాలుగైదుసార్లు యజమాని మను షులు వచ్చి చాంగ్ పనిలోకి రావటం గురించి అడిగారు. ప్రతిసారీ చాంగ్ తల్లి, "మావాడికి జబ్బుగా ఉంది!" అని సమా ధానం చెప్పింది. తరవాత మనుషులు

రావటం మానేశారు; ఇంకొక మనిషిని పెట్టుకుని ఉంటారని ఆవిడ అనుకున్నది.

ఒక నెల గడిచింది. చాంగ్ దగ్గిర ఉన్న డబ్బంతా అయిపోయింది. తన యజమాను రాలిచ్చిన బట్టలు గాని, వెండిముద్దగాని అమ్మటానికి వాడు భయపడ్డాడు. "అమ్మా, తింటూ కూచుంటె కొండలుకూడా తరిగిపోతాయని సామెతగదా! ఉద్యోగం లేకుండా ఇలా ఎంతకాలం గడుస్తుంది?" అని చాంగ్ తల్లితో అన్నాడు.

"నాయనా, నీ తండ్రి నూలూ, కుంకమూ అమ్మి జీవించాడు. నువ్వూ ఆ పనే చెయ్యి," అంటూ నూలుతట్ట చూపింది తల్లి.

త్వరలోనే దీపాల పండగ వచ్చింది. చాంగ్ తన తల్లితో, "అమ్మా, దీపాలు చూడబోతాను. ఈ ఏడు రాజభవనందగ్గిర చాలా పెద్ద దీపాలు పెడతారట," అన్నాడు.

"భద్రం, నాయనా. మీ యజమాని ఇంటి మీదిగా వెళ్ళేవు! ఏదన్నా ప్రమాదం జరగవచ్చు! ఏమైనా ఒక్కడివీమాత్రం వెళ్లకు," అన్నది తల్లి.

చాంగ్ తన మిత్రుడొకణ్ణి వెంటబెట్టుకుని దీపాలను చూడటానికి రాజభవనంకేసి వెళ్లాడు. సరిగా వాళ్లు అక్కడ చేరే సమయానికి జనం తొక్కుకుంటూ కోలాహలంగా ఉన్నారు; ఎందుకంటే, రాజుగారు నౌకర్లు



అప్పుడే జనానికి దక్షిణలూ, పానీయాలూ ఇవ్వటం ప్రారంభమయింది.

"ఈ గుంపును తోసుకుని మనం ముందుకు పోలేం. మంత్రిగారి ఇంటిదగ్గిర కూడా మంచిమంచి దీపాలు పెడతారు! అక్కడికి పోదాం," అనుకుని వారు మంత్రిగారి ఇంటికేసి వెళ్ళారు. కాని అక్కడకూడా పెద్ద జాతరగానే ఉంది. పైగా ఆ గుంపులో చాంగ్ వెంట ఉన్న కుర్రవాడు కాస్తా ఎటో కనపడకుండా పోయాడు.

చాంగ్‌కు తన పాత యజమాని ఇల్లు గుర్తుకొచ్చింది. దీపాల పండగనాడు ముసలాడు రకరకాల టపాసులు కాలుస్తాడు. చూడటానికి సరదాగా ఉంటుంది. ఈ ఉద్దేశంతో చాంగ్ తన పాత యజమాని ఇంటికి వెళ్ళాడు. కాని అక్కడ దీపాలుకూడా లేవు. ఇల్లు మూసి ఉన్నది. ఇంట్లో ఎవరూ లేరు. ద్వారానికి ఒక పత్రం అంటించి ఉన్నది. చాంగ్ దగ్గిరికి వెళ్ళి చదివితే ఆ ఇల్లు జప్తు అయిందనీ, ఇంటి యజమానిని ఖైదు చేశారనీ తెలిసింది. చాంగ్ మిగతా వివరాలు చదివే లోపుగా రక్షకభటుడొకడు వచ్చి, "ఏయ్, ఎవరు నువు? ఎందుకీ ఇంటిదగ్గిర తారట్లాడుతున్నావు?" అని గద్దించాడు.

చాంగ్‌కు దడ పుట్టింది. వాడు కాలి సత్తువకొద్దీ పారిపోయాడు. వాడు ఒక వీధి






వెంట నడుస్తూండగా ఎవరో మనిషి వెనక నుంచి కేకవేసి ఆగమని, "నిన్నెవరో రమ్మంటున్నారు," అన్నాడు.

ఆ మనిషి ఒక పూటకూటి ఇంటి నౌకరని చాంగ్ గుర్తించాడు. తన మిత్రుడు అక్కడికి చేరాడు కాబోలు, ఫలహారానికి పిలుస్తున్నా డనుకుని చాంగ్ ఆ నౌకరువెంట వెళ్లాడు. తీరా వెళ్ళాక వాడికి తన పాత యజమానురాలు కనిపించింది.

"మీరా? ఇక్కడ ఉన్నారేమిటి?" అని చాంగ్ ఆమెను అడిగాడు.

"నా భర్త పూటావెండి నాణాలు తయారుచేసినందుకు ఆయనను పట్టుకుపోయి, ఆస్తి అంతా జప్తుచేశారు. నేను దిక్కులేనిదాన్ని అయాను. నన్ను మీ ఇంట్లో కొద్దికాలం ఉండనిస్తావా?" అని ఆమె చాంగ్‌తో అన్నది.

"అది సాధ్యమయే పని కాదు. మా అమ్మ అలాటివి ఏమాత్రమూ సహించదు. లేని పోని అపవాదులు మాపైన వచ్చి పడతాయి," అన్నాడు చాంగ్.

"ఒకసారి చేరనిస్తే వదలనని భయపడుతున్నావా, చాంగ్? ఈ ముత్యాల హారం చూడు!" అంటూ ఆమె ఒక మేలి ముత్యాల తావళం తీసి చూపింది. అందులో నూటఎనిమిది అపురూపమైన ముత్యాలున్నాయి. వాటిని చూసి చాంగ్ ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

"నన్ను మీ ఇంట ఉండనిచ్చావంటే నీకేమీ నష్టం ఉండదు. ఒక్కొక్క ముత్యమే అమ్మి ఆ డబ్బుతో మీరూ, నేనూ కూడా కాలక్షేపం చెయ్యవచ్చు. నా బరువు నీకేమీ ఉండదు," అన్నది పాత యజమానురాలు.

"నీకు నిజంగా మా ఇంటికి రావాలని ఉంటే మా అమ్మ అంగీకరించాలి. ఆవిడను అడిగి వస్తాను," అన్నాడు చాంగ్.

ఆమె చాంగ్ వెంట అతని ఇంటిదాకా వెళ్లి బయట నిలబడింది. చాంగ్ లోపలికి



వెళ్లి తన పాత యజమానురాలి విషాదగాథ తల్లితో చెప్పాడు.

"అలాగుట్రా, నాయనా? పాపం, ఆమె ఇప్పు డెక్కడుంది?" అన్నది తల్లి.

"బయటనే ఉన్నారు!" అన్నాడు చాంగ్.

"లోపలికి రమ్మను," అన్నది తల్లి.

పాత యజమానురాలు లోపలికి వచ్చి, "నాకు తోడూ నీడా ఎవరూ లేరు. అందుచేత మీ పాలబడ్డాను. నన్ను ఇక్కడ ఉండ నివ్వండి," అన్నది.

"కొద్ది రోజులపాటు అలాగే ఉండమ్మా. మరేంలేదు గాని, మేము పేదవాళ్లం. ఈ ఇల్లు నీ బోటి వాళ్లకు తగినది కాదు. అదే మా భయం. మీ బంధువు లెవరన్నా ఉంటే తరవాత అక్కడికే వెళ్లవచ్చు," అన్నది చాంగ్ తల్లి.

పాత యజమానురాలు తన ముత్యాల దండ పైకి తీసి, "ఈ ముత్యాలు ఒకటొకటే అమ్మి మీరు నూలువ్యాపారం చేసుకో వచ్చు," అన్నది.

తరవాత చాంగ్ నూలు వ్యాపారం సాగించాడు. అదివరకు అతని యజమాని వద్ద నూలు కొనేవారంతా ఇప్పుడు చాంగ్ వద్ద కొనటంచేత వ్యాపారం బాగా సాగింది. ఈ సమయంలో పాత యజమానురాలు అతన్ని ఆకర్షించటానికి ఎన్నో ప్రయత్నాలు చేసింది. అయితే చాంగ్ ఆమెను తన తల్లి లాగే చూశాడు.

ఇంతలో వసంతోత్సవం వచ్చింది. ఆ నాడు చాంగ్ సంబరం చూసి ఇంటికి తిరిగి వస్తుండగా అతనికి తలవని తలంపుగా పాత యజమాని కనిపించాడు. ఆయన వాలకమూ, దుస్తులూ చూస్తే చాంగ్‌కు గుండె కరిగిపోయింది. "బాబూ, మీ కిలాటి దుస్థితి ఎలా సంభవించింది?" అని చాంగ్ ముసలాణ్ణి అడిగాడు.

"నే నసలు దాన్ని పెళ్లాడటం పెద్ద పొరపాటయింది. అది ఏంచేసిందో తెలుసా?

మంత్రిగారింటినుంచి ఒక ముత్యాల హారం కాజేసింది. ఒకనాడు మంత్రిగారి మనుషులు వచ్చి ఇల్లంతా సోదాచేసి, ముత్యాల హారం ఎక్కడని నన్ను అడిగారు. నాకు తెలియదన్నాను. వాళ్లు నన్ను చావ చితకగొట్టి జైలులో వేశారు. అదృష్టవశాత్తూ నా భార్య ఉరి పోసుకు చచ్చింది. అది దొంగ అని తేలిందిగాని ఆ ముత్యాలహారం మటుకు కనిపించలేదు," అన్నాడు పాత యజమాని.

చాంగ్‌కు ఈ మాటలు అయోమయంగా తోచాయి. ఆ ముత్యాల హారమూ, ఆ మనిషీ తన ఇంట ఉండగా ఈయన ఆమె ఉరి పోసుకున్నదంటాడేమిటి?

చాంగ్ తన పాత యజమానిని తన ఇంటికి వెంటబెట్టుకు వెళ్ళి, దాసీదానితో "చిన్నమ్మగారిని ఒకసారి బయటికి రమ్మను!" అన్నాడు.

దాసీది లోపలికి వెళ్ళివచ్చి కంగారుగా, "ఇంతకు ముందు కూడా ఇక్కడే ఉన్నారు, ఇంతలో ఏమైపోయారోగాని చిన్నమ్మగారెక్కడా కనిపించటంలేదు, బాబూ!" అని చెప్పింది.

తన పాత యజమాని చెప్పినది నిజమేననీ, ఇంతకాలమూ తన ఇంట ఉన్నది దయ్యమేననీ చాంగ్ రూఢి చేసుకున్నాడు. అతను తనవద్ద మిగిలిన ముత్యాలన్నీ తన పాత యజమానికివ్వటమే గాక, తాను లోగడ అమ్మిన ఒకటి రెండు ముత్యాలు కూడా మళ్ళీ కొని ఇచ్చాడు.

ముసలాడు వాటిని తీసుకుపోయి మంత్రికి పప్పజెప్పాడు. జప్తు చేసిన ఆయన సొత్తంతా విడుదల అయింది.

చాంగ్ చాలా నిజాయితీపరుడూ, న్యాయబుద్ధి కలవాడూ గనకనే అతను దయ్యం ఆకర్షణకు లోబడలేదు, తన యజమానికి ముత్యాలు తిరిగి ఇచ్చాడు. అతని మంచి బుద్ధిని గురించి ప్రజలు ఎంతో కాలం చెప్పుకున్నారు.






# మధ్యముడు

పాండవులు మాయజూదంలో ఓడిపోయి అరణ్యవాసం చేస్తున్న కాలంలో కురుజాంగల దేశంలోని యూపగ్రామవాసి అయిన కేశవదాసనే బ్రాహ్మడు ఉద్యామకమనే గ్రామానికి తన భార్యతోనూ, ముగ్గురు కుమారులతోనూ బయలుదేరాడు. ఏమంటే ఆ గ్రామంలో ఆయన బంధువుల ఇంట ఉపనయనం జరుగుతున్నది.

కేశవదాసు కుటుంబం అరణ్యంలో పాండవులుండే ఆశ్రమం పరిసరాలలోకి వచ్చేసరికి తలవని తలంపుగా ఒక భీకరాకారం వారికి ఎదురయింది. ఆ మనిషి చింపిరిజుట్టూ, పచ్చగా ఉన్న పెద్దకళ్లూ, నల్లటి శరీరచ్ఛాయా, ఎత్తుపళ్లూ, విశాలంగానూ, బలిష్ఠంగానూ ఉన్న రొమ్మూ చూసి అయిదుగురూ దడుచుకున్నారు.

ఆ వచ్చినవాడు ఘటోత్కచుడు; భీముడికీ, హిడింబికీ పుట్టిన కొడుకు. వాడు తన తల్లి భోజనార్థం ఎవడైనా యువకుడు దొరుకుతాడేమోనని వెతుకుతూ బయలుదేరాడు. అదృష్టవశాత్తూ వాడికి బ్రాహ్మణ దంపతులూ, వారి ముగ్గురు కొడుకులూ కనిపించారు. వారు తనను చూసి పారిపోతూండటం చూసి ఘటోత్కచుడు, "బ్రాహ్మణోత్తమా, ఆగు, ఆగు! గరుత్మంతుణ్ణి చూసిన పాములాగా ఎందుకు పారిపోతావు?" అన్నాడు.

వాడు రాక్షసుడనీ, తమ కేదో అపకారం చేస్తాడనీ కేశవదాసుకు తెలిసిపోయింది. ఆ సమీపంలోనే పాండవుల ఆశ్రమం ఉన్నదని ఆయనకు తెలుసుగాని, భీముణ్ణి ఒక్కణ్ణే ఆశ్రమంలో కాపుంచి మిగిలిన పాండవులందరూ ధౌమ్యుడి ఆశ్రమంలో జరిగే యజ్ఞానికి వెళ్లారని ఆయన విని ఉన్నాడు. తమను ఈ రాక్షసుడినుంచి రక్షించటానికి భీముడే చాలు. కాని కేశ

పెడితే భీముడికి వినిపిస్తుందా? దట్టంగా లతలు పెనవేసుకుపోయిన అరణ్య వృక్షాల లోనుంచి కేక ఎంతో దూరం వెళ్లదు. అందు చేత ఆ బ్రాహ్మడు ఎలాగైనా ఆ రాక్షసుణ్ణే మంచి చేసుకుందామనుకుని ఘటోత్కచు డితో, "నాయనా, దారికి అడ్డుతగిలి మమ్మల్ని ఎందుకు బాధిస్తావు? మా దారిన మమ్మల్ని వెళ్ళనీ!" అన్నాడు.

"బాబూ, అలాగే వెళ్లవచ్చు. కాని ముందు నాకు మీ కుమారులలో ఒక్కణ్ణి దయచేయించండి. మా అమ్మకు ఇవాళ నర మాంసంమీద కోరిక పుట్టింది. తినటానికి పనికివచ్చే మనిషిని తీసుకురమ్మని ఆవిడ నన్ను ఆజ్ఞాపించింది," అన్నాడు ఘటోత్కచుడు.

"ఓరీ, రాక్షసాధమా! నేను బ్రాహ్మణ జన్మ ఎత్తినవాణ్ణిగదా, వేదపారంగతుడనైన నేను నా కొడుకును నరభక్షకుల వాత పెడితే నాకు ఉత్తమలోకాలుంటాయా?" అన్నాడు కేశవదాసు.

"తమరు ఒక్క కొడుకును ఇవ్వటానికి పేచీపెడితే మీ అయిదుగురినీ నేను క్షణంలో చంపెయ్యగలను," అన్నాడు ఘటోత్కచుడు. ఈ మాటలకు కేశవదాసు వణికిపోతూ భార్యతో, "ఏమే, నా వయసు




తీరిపోయింది. నేనే రాక్షసుడికి బలి అయేదా ఏమిటి?" అన్నాడు.

"వద్దు, వద్దు. భర్తకోసం బలి కావటం భార్య ధర్మం. నా వయసూ ఉడిగిపోయింది. నన్నే ఈ రాక్షసుడి వాత పడనివ్వండి," అన్నది భార్య.

"మా అమ్మకు ముసలివాళ్లూ, స్త్రీలూ పనికిరారు," అన్నాడు ఘటోత్కచుడు.

తరవాత కేశవదాసు ముగ్గురు కొడు కులూ, నేను బలి అవుతానంటే నేను బలి అవుతానని పోటీలు పడ్డారు.

"నాయనా, చేతికి వచ్చినవాడవు, నీవు బలికావటం నా కిష్టం లేదు," అన్నాడు

కేశవదాసు పెద్దకొడుకుతో. బ్రాహ్మడి భార్య కడగొట్టువాణ్ణి ఇవ్వనన్నది.

అప్పుడు బ్రాహ్మడి కొడుకులలో మధ్యముడు, "నేనే ఎవరికీ అక్కర్లేదు!" అన్నాడు విచారంగా.

"నాకు కావాలి! వేగిరం బయలుదేరి నావెంట రా!" అన్నాడు ఘటోత్కచుడు మధ్యముడితో.

ఆ కుర్రవాడు తన తల్లిదండ్రులకూ, అన్నకూ, తమ్ముడికీ వీడ్కోలు చెప్పి, ఘటోత్కచుడితో, "దాహమవుతున్నది. ఇప్పుడే కాసిని మంచినీరు తాగి వస్తాను, ఉండు!" అంటూ చెరువుకేసి వెళ్లాడు.

వాడు ఎంతసేపటికీ తిరిగి రాకపోవటం చూసి ఘటోత్కచుడు కేశవదాసుతో, "మీ వాడు ఎంతకూ రాకుండా ఉన్నాడు. కేక పెట్టి పిలుస్తాను, దయచేసి వాడి పేరు చెబుతారా?" అని అడిగాడు. బ్రాహ్మడు చెప్పనన్నాడు. బ్రాహ్మడి పెద్దకొడుకు నడిగితే "మేము. వాణ్ణి మధ్యముడని పిలుస్తాము," అన్నాడు.

చేసేది లేక ఘటోత్కచుడు గొంతెత్తి, అరణ్యం మారుమోగేలాగ, "మధ్యమా! మధ్యమా! వెంటనే రా!" అని కేకపెట్టాడు. ఈ కేక దూరాన ఉన్న భీముడికి వినిపించింది. అతనుకూడా కుంతీసుత మధ్యముడే



గనక తనను ఎవరో పిలుస్తున్నారనుకుని వచ్చాడు. అతనికి ఘటోత్కచుణ్ణి చూడగానే ఆనందం కలిగింది. కేశవదాసుకు భయం కలిగించిన ఘటోత్కచుడు భీముడి కంటికి మంచి కొదమసింగంలాగా కనిపించాడు.

ఘటోత్కచుడింకా, "మధ్యమా, త్వరగా రా!" అని కేకలుపెట్టటం చూసి భీముడు "వచ్చానుగా!" అన్నాడు.

"ఏమిటి, నీవుకూడా మధ్యముడవేనా?" అని ఘటోత్కచుడు అడిగాడు. తన తల్లిబిడ్డలలో తానుకూడా మధ్యవాణ్ణేనని భీముడు చెప్పాడు. బ్రాహ్మడు తన భార్యాపుత్రులతో, "ఈ వచ్చినవాడు తప్పక భీముడే అయి ఉంటాడు!" అని రహస్యంగా అన్నాడు.

ఈ సమయానికి బ్రాహ్మడి రెండో కొడుకు దాహం తీర్చుకుని వచ్చి ఘటోత్కచుడితో, "వచ్చేశాను. పోదాం పద," అన్నాడు.

కేశవదాసు భీముడితో తన వృత్తాంతమంతా చెప్పుకుని, "బాబూ, ఆ రాక్షసుడు నా కొడుకును తన తల్లికి ఆహారంగా తీసుకుపోతున్నాడు. వాడి బారినుంచి మమ్మల్ని కాపాడు!" అన్నాడు.

భీముడు ఘటోత్కచుణ్ణి ఆగమని కేకపెట్టి, "ఓరీ, నీవీ బ్రాహ్మణ కుటుంబాన్ని






ఎందుకు బాధిస్తున్నావు? ఈ కుర్రవాణ్ణి తక్షణం వదిలిపెట్టెయ్యి," అన్నాడు.

"మా అమ్మ ఆజ్ఞానుసారం నేను వీణ్ణి పట్టుకుపోతున్నాను. మా తండ్రి చెప్పినా కూడా నేను వీణ్ణి వదిలిపెట్టను," అన్నాడు ఘటోత్కచుడు.

"మా తల్లి ఆజ్ఞను పాలించే మేమీ దుస్థితికి వచ్చాం!" అని లోపల అనుకుని, పైకి, "ఎవరురా నీ తల్లి?" అని అడిగాడు భీముడు. "మా తల్లి హిడింబి, మా తండ్రి భీముడు!" అన్నాడు ఘటోత్కచుడు.

"అందుకే వీడికి నా దేహబలం వచ్చింది. కాని అనాథులపట్ల నాకు గల దయ వీడికి రాలేదు!" అనుకుని భీముడు, "చాల్లే, ఈ కుర్రవాణ్ణి వదిలిపెట్టు!" అన్నాడు.

"నేను వదిలిపెట్టేది లేదు!" అన్నాడు ఘటోత్కచుడు.

భీముడు కేశవదాసుతో, "అయ్యా, మీరు మీ అబ్బాయిని తీసుకోండి. అంతగా అయితే ఈ రాక్షసుడి వెంట నేనే పోతాను," అన్నాడు.

ఘటోత్కచుడికి కోపం వచ్చి, "ఈ బ్రాహ్మణ కుమారుణ్ణి ఇక్కడే చంపి తీసుకుపోతాను. నన్నెవరు అడ్డుతారో చూస్తాను," అన్నాడు.

"నేనే అడ్డుతాను," అన్నాడు భీముడు.

"అలాఅయితే నీవే నా వెంట రారాదూ?" అని ఘటోత్కచుడు భీముణ్ణి అడిగాడు.

"చాతనయితే నన్ను బలాత్కారంగా తీసుకుపో, నీ శక్తి చూస్తాం! నీకు శక్తి చాలకపోతే అప్పుడు నేనే వస్తాను," అన్నాడు భీముడు.

"నేనెవరో తెలిసి మాట్లాడుతున్నావా?" అని ఘటోత్కచుడు అడిగాడు.

"తెలుసు. నీవు నా కొడుకువు!" అన్నాడు భీముడు.

ఈ మాటకు ఘటోత్కచుడు చిందులు తొక్కాడు. వాడి కోపం చూసి భీముడు చాలా

ముచ్చటపడి, "కోప్పడకు. నావంటి వీరుడు నీవంటి వీరకుమారుణ్ణి కొడుకు అనుకోవటంలో తప్పులేదు, క్షమించు," అన్నాడు.

"మొదట అవమానించటం గాక ఇప్పుడు భయపడి క్షమాపణ వేడుతావా?" అన్నాడు ఘటోత్కచుడు.

"భయమా? అది ఎలా ఉంటుందో కూడా నాకు తెలియదే. నీవద్ద నేర్చుకుంటాను చెప్పు. భయమెలా ఉండేదీ ముందు తెలుసుకున్నాక కర్తవ్యం నిర్ణయిస్తాను," అన్నాడు భీముడు.

"భయం ఎలా ఉంటుందో ఇప్పుడే చెబుతాను. ఏ ఆయుధం తీసుకుంటావో తీసుకో!" అన్నాడు ఘటోత్కచుడు.

భీముడు కుడిచెయ్యి చాచి, "శత్రువులను మర్దించటంలో ఆరితేరిన ఈ చెయ్యే నా ఆయుధం," అన్నాడు.

"ఏమిటి, నువ్వు భీముణ్ణి అనుకుంటున్నావా?" అన్నాడు ఘటోత్కచుడు వెటకారంగా నవ్వుతూ.

"ఎవరా భీముడు? శివుడా, కృష్ణుడా, ఇంద్రుడా, యముడా?" అని భీముడు అడిగాడు.

"అందరూ కలిస్తే ఆయనకు సమానమౌతారు," అన్నాడు ఘటోత్కచుడు.



"అది అబద్ధం!" అన్నాడు భీముడు.

"నా తండ్రిని అవమానిస్తావుగా?" అంటూ ఘటోత్కచుడు ఒక పెద్ద చెట్టు పెరికి భీముడిపై విసిరాడు. భీముడు ఒక చిన్న తోపుతో దాన్ని పక్కకు నెట్టేశాడు. తరవాత ఘటోత్కచుడు ఒక కొండ శిఖరాన్ని ఎత్తి భీముడిపైన వేస్తే దాని గతికూడా అంతే అయింది.

తరవాత ఇద్దరూ కలియబడి మల్ల యుద్ధం చేశారు. అందులో ఓడిపోయిన ఘటోత్కచుడు భీముణ్ణి తన మాయచేత బంధించ యత్నించాడు. కాని భీముడు ఆ ప్రయత్నాన్నికూడా సాగనివ్వలేదు.

"నాకు శక్తి చాలకపోతే నా వెంట వస్తానని ఇంతకుముందు మాట ఇచ్చావు. అది జ్ఞాపకమున్నదా?" అని ఘటోత్కచుడు భీముణ్ణి అడిగాడు.

"అయితే దారితియ్యి!" అంటూ భీముడు ఘటోత్కచుడి వెంట బయలుదేరి హిడింబి ఉండే చోటికి వెళ్ళాడు. భీముణ్ణి బయట ఉంచి ఘటోత్కచుడు తన తల్లివద్దకు వెళ్ళి, "అమ్మా, నీ భోజనానికి మనిషిని తెచ్చాను!" అన్నాడు.

"ఎలాటి మనిషిరా, నాయనా?" అని హిడింబి అడిగింది.

"మాట మనిషిమాత్రేగాని, బలం మనిషి బలం కాదమ్మా!" అన్నాడు ఘటోత్కచుడు ఆశ్చర్యపడుతూ.

"ఎవరో చూడనీ," అంటూ హిడింబి బయటికి వచ్చి భీముణ్ణి చూసి, "ఈయన మనిషి ఎందుకవుతాడురా, నాయనా? మనకు దేవుడు!" అన్నది.

"హిడింబీ, ఏమిటిదంతా?" అని భీముడు హిడింబిని అడిగాడు.

"మరేమీ లేదు. మిమ్మల్ని ఒక్కసారి చూడాలనిపించింది. తినటానికి మనిషిని పట్టుకురమ్మని కొడుకును పంపాను, ఆ మనిషిని రక్షించటానికి మీరు వస్తారని నాకు తెలుసు!" అన్నది హిడింబి.

ఈ మాటలకు భీముడు సంతోషించి, "నీ రాక్షసి బుద్ధులు పోలేదేమోనను కున్నాను!" అన్నాడు.

ఘటోత్కచుడు తండ్రికి క్షమాపణ చెప్పుకుని, "రేపు ఆ కౌరవులనే అరణ్యానికి నేను కార్చిచ్చునవుతాను!" అని వాగ్దానం చేశాడు.

కేశవదాసు భీముడికి తన కృతజ్ఞత తెలుపుకుని భార్యా పుత్రులతో తన దారిన తాను వెళ్ళిపోయాడు. భీముడు తన భార్య అయిన హిడింబి ఆతిథ్యాన్ని స్వీకరించటానికి ఉండిపోయాడు.



# ప్రఖ్యాతమైన ఆటవస్తువు



పిల్లలు ఆడుకునే ఆటవస్తువులూ, బొమ్మలూ మానవత్వం పెంపొందించేవిగా ఉండాలి. క్రౌర్యాన్నీ, దుర్మార్గాన్నీ ప్రతిబింబించే ఆట వస్తువులు తయారు చెయ్యరాదని రష్యాలో నియమం ఉన్నది. అందుచేత అక్కడ పిస్తోళ్ళూ, మారణాయుధాలూ మొదలైన వాటిని ఆటవస్తువులుగా తయారుచెయ్యరు. మనం ఈనాడు పాశ్చాత్యదేశాలను అనుక రిస్తున్నాముగాని పూర్వం మన సంప్ర దాయంకూడా ఇలాటిదే.

రష్యాలో తయారయే పిల్లల బొమ్మలలో "మత్ర్యోష్కా" ప్రసిద్ధమైనది. అది ఒక బొమ్మకాదు—36 బొమ్మలు ఒకదాని లోపల ఒకటి అమర్చి ఉంటాయి; ఒకదాని కంటె ఒకటి చిన్నదిగా ఉంటుంది. కాని అన్ని బొమ్మలూ ఒక రకంగానే రంగులూ, దుస్తులూ వేసి ఉంటాయి.

"మత్ర్యోష్కా" ఈనాడు సృష్టి అయిన బొమ్మ కాదు. కిందటి శతాబ్దంలోనే సృష్టి అయి దేశదేశాలకూ వెళ్లింది. డెబ్భై సంవత్స రాలక్రితం త్రీయాత్సె—సెర్గీయెవ్ కంపెనీ వారినుంచి లండను వ్యాపారస్థులు ఈ బొమ్మలను దిగుమతిచేసి చురుకుగా అమ్మారు. అప్పుడే ఈ బొమ్మ మొట్ట మొదటిసారిగా జర్మనీ, ఫ్రాన్సుదేశాలలో కూడా దిగుమతి అయింది.

జర్మనీవారు దీనిని చూసి ఒక బొమ్మను తయారుచేశారు. "బ్లూ బియర్డ్" అనేవాడు వరసగా తన భార్యలు ఏడుగురిని చంపి నట్టు ఒక కథ ఉన్నది. దానిని చిత్రించ టానికిగాను వారు ఒక గడ్డంవాడి బొమ్మను తయారుచేసి అందులో వాడి భార్యల బొమ్మలు ఒకదానిలో ఒకటిగా అమర్చి, అన్ని బొమ్మలకూ లోపలగా ఒక విషంసీసా అమర్చారు. కాని ఈ బొమ్మ పిల్లలను "మత్ర్యోష్కా" లాగ ఆకర్షించలేదు. ఈనాడుకూడా రష్యా ఏటా లక్ష "మత్ర్యో ష్కా" బొమ్మలను తూర్పు యూరపు దేశా లకూ, అమెరికా, ఫిన్లాండ్, బ్రిటన్, స్వీడన్ వగైరా దేశాలకూ ఎగుమతి చేస్తోంది.



# మరుగుజ్జుల కథలు

అల్ప్సు పర్వతాలలో నివసించేవారు మరుగుజ్జులను గురించి ఇప్పటికీ అనేక కథలు చెప్పుకుంటారు. ఈ మరుగుజ్జులు ఒకప్పుడు తమ పర్వతాల గుహలలోనూ, దట్టమైన అరణ్యాలలోనూ నివసించేవారనీ, కాల క్రమాన వారు ఆ ప్రాంతాలు వదలి వెళ్ళిపోయారనీ వారి నమ్మకం.

మరుగుజ్జులు రెండడుగుల ఎత్తు మనుషులు. వారికి కొన్ని అపూర్వ శక్తులుకూడా ఉండేవి. వారు దయాస్వభావులు, మామూలు మనుషులకు ఎన్నో విధాల సహాయపడేవారు, మనుషులు తమకు ఎప్పుడైనా మేలుచేస్తే మరిచేవారుకారు. పశువులను కాచేవారు. వైద్యంలో గొప్ప నిపుణులు. వారికి ఆహారం ఆటే అవసరంలేదు. వారు మనుషుల పిల్లలకు కానుకలుగా బొగ్గులు తెచ్చి ఇచ్చేవారు. మర్నాడు చూసుకుంటే అవి బంగారు కణికలుగా మారి ఉండేవి. కొందరు మరుగుజ్జులు కొండలలో వజ్రాలు మొదలైనవాటికోసం వెతికేవారు.

ఒక వేసవిలో ఒక మరుగుజ్జు ఒక పర్వతంమీదికి రత్నాలు వెతకటానికి వచ్చాడు. అతను ఏడు సంచులు వెంట తెచ్చుకున్నాడు. చెంగుచెంగున రాళ్ళమీదుగా దూకుతూ రత్నాలు ఏరి ఏడు సంచులూ నించుకుని, ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయి, మళ్ళీ రెండురోజులకు ఖాళీ సంచులతో తిరిగి వచ్చాడు.

ఆ పర్వతంమీద ఉండే పశువుల కాపరులు మరుగుజ్జు మళ్ళీ కనిపించేసరికి చాలా సంతోషించారు. అతను రాత్రిపూట పశువుల కాపరుల మధ్య కూచుని తమ నగరం గురించి అద్భుతమైన కథలు చెప్పేవాడు.

ఒకనాడు పశువుల కాపరులకు మరుగుజ్జును ఏడిపించాలన్న బుద్ధి పుట్టింది. వారు అతని నిండు సంచులలో ఒకటి తీసి

సి. వాసుదేవశర్మ

దాచిపెట్టేశారు. మరుగుజ్జు చీకటి పడగానే తిరిగి వచ్చి, తన సంచీ ఒకటి మాయం కావటం గ్రహించి, "నా రత్నాల సంచీని నాకిస్తారా? లేక నన్నే తెచ్చుకోమన్నారా?" అని అడిగాడు.

"చేతనయితే తెచ్చుకో," అన్నారు పశువుల కాపరులు.

మరుగుజ్జు వెంటనే కొండమీదికి వెళ్ళి, దాచిఉన్న చోటినుంచి తన సంచీని తెచ్చుకున్నాడు. ఆ తరవాత అక్కడివారెవరూ అతని వస్తువులు అంటుకోలేదు.

కొండలపైన మంచు పడ నారంభించగానే మరుగుజ్జు వెళ్లిపోతూ, "నేను మా నగరానికి వెళ్లిపోతున్నాను. మీలో ఎవరైనా అక్కడికి వస్తే సంచీడు వెండి కానుకగా ఇస్తాను!" అన్నాడు పశువుల కాపరులతో.

ఈ ఆహ్వానాన్ని ఎవరూ పాటించలేదు గాని ఒక్కడుమాత్రం వెండి తెచ్చుకుందామని బయలుదేరాడు. అతను కొండలూ, నదులూ దాటుకుంటూ దక్షిణంగా వెళ్ళి, పాలరాతి బురుజులు గల మరుగుజ్జుల నగరం చేరుకున్నాడు. ఆ నగరం ప్రవేశించినాక అతడికి, "ఎందుకు వచ్చానా?" అనిపించింది. ఏమంటే, అతనికి ఆ మరుగుజ్జు పేరుకూడా తెలియదు.



ఆ మహానగరంలో తనను ఆహ్వానించిన వాణ్ణి ఎలా గుర్తించటం?

అతను వీధివెంట దిగులుగా నడుస్తుండగా ఎవరో వెనకనుంచి భుజంమీద తట్టారు. మంచి పట్టుబట్టలు ధరించిన ఒక మరుగుజ్జు పెద్దమనిషి కనిపించి, "పశువుల కాపరులంతా క్షేమంగా ఉన్నారా?" అని అడిగాడు. పేదవాడిలాగా తమ ప్రాంతానికి వచ్చిన మరుగుజ్జు అతనేనని గుర్తించి పశువుల కాపరి ఆశ్చర్యపోయాడు.

తరవాత ఆ మరుగుజ్జు తన అతిథిని ఇంటికి తీసుకుపోయాడు. ఆ ఇంటికి రాజభవనాలుకూడా చాలవు. పశువుల కాపరి

అద్భుతమైన ఆహారం తిని, హంసతూలికా తల్పంపై నిద్రపోయాడు. మరుగుజ్జు అతడికి నగరంలోని వింతలన్నీ చూపాడు.

దివ్యభోగాలన్నీ అనుభవిస్తూ కొన్నాళ్ళు గడిపినాక పశువులకాపరికి అలాటి జీవితం మొహంమొత్తింది. అతనికి తన ఇల్లూ, భార్యా, పిల్లలూ జ్ఞాపకం వచ్చి విచారం ముంచుకువచ్చింది.

ఇది గమనించి మరుగుజ్జు, "ఎందుకు విచారంగా ఉన్నావు? నీకిక్కడ సుఖంగా లేదా?" అని అడిగాడు.

"నాకు ఇంటిమీద గాలి మళ్ళింది. నేను పోతాను!" అన్నాడు పశువుల కాపరి. మరుగుజ్జు అతనికి సంచీడు వెండి బహుమానంగా ఇచ్చి ఇంటికి పంపేశాడు.

* * *

ఒక లోయలో ఒక పిండిమర ఉండేది. దాని యజమాని దురాశాపరుడు. అతని భార్య దీర్ఘవ్యాధితో తీసుకుంటున్నది.

ఒక ఏడు ఆ లోయలో వానలు కురియక క్షామం వచ్చింది. మరుగుజ్జులలో ఒకడు మర వద్దకు వచ్చి కొంచెం పిండి కావాలని అడిగాడు. మర యజమాని కేకలుపెట్టి మరుగుజ్జును వెళ్ళగొట్టాడు.

మర యజమాని కొక కొడుకుండేవాడు. వాడు మరుగుజ్జును చూసి జాలిపడి, తండ్రి



చూడకుండా అతడి సంచీనిండా పిండి నింపి చాటుగా ఇచ్చాడు. తరవాత కొంతకాలానికి ఈ కుర్రవాడు తన తండ్రి పశువులను మేపటానికి తోలుకుపోతూ ఉండగా దారిలో ఆ మరుగుజ్జు కనిపించి, మరుగుజ్జుల విందుకు వాణ్ణి ఆహ్వానించాడు.

కుర్రవాడు అలాగేనని మరుగుజ్జు వెంట బయలుదేరాడు. మరుగుజ్జులుండే గుహ యొక్క ద్వారం ఒక చెట్టుతొర్ర. ఇద్దరూ ఆ చెట్టుతొర్రగుండా ఒక గుహలో ప్రవేశించారు. పోనుపోను గుహ విశాలమై, చివరకు ఒక విస్తీర్ణమైన మైదానం వచ్చింది. ఆ మైదానం నిండా పళ్లచెట్లున్నాయి. అక్కడ మరుగుజ్జులంతా చేరి ఆటలాడుతున్నారు, విందులు ఆరగిస్తున్నారు, నృత్యాలు చేస్తున్నారు, పాడుతున్నారు. కుర్రవాడు వారితో బాటు ఆటలాడి విందులో పాల్గొన్నాడు.

చివరకు మరుగుజ్జులు ఒక్కొక్కరే అదృశ్యమైపోయి, కుర్రవాడూ, అతనిని ఆహ్వానించిన మరుగుజ్జూ మిగిలారు.

"చూడు, బాబూ! ఈ పండు మీ అమ్మకిచ్చి వెంటనే తినమను. ఈ కాయ మీ నాన్నకు ఇయ్యి. నా జ్ఞాపకార్థం ఈ ముత్యాల హారం నువు ధరించు! మనం ఎంతదూరం వచ్చామో నీకు తెలీదు. గుహ దాటగానే విశ్రాంతి తీసుకుని తరవాత నింపా





దిగా ఇంటికి వెళ్ళు!" అని కుర్రాడితో మరుగుజ్జు చెప్పాడు.

ఈ లోపల కుర్రాడి జాడ తెలియక తల్లిదండ్రులు తహతహలాడసాగారు. ఆ రోజు ఆవులు తమకు తామే ఇంటికి తిరిగి వచ్చాయి. రోజులు గడుస్తున్నాయి గాని కుర్రాడి జాడ లేదు.

వారం రోజులు గడిచాక కుర్రాడు ఇంటికి చేరుకుని, తల్లిదండ్రులకు జరిగిన సంగతి చెప్పి, మరుగుజ్జు ఇచ్చిన కానుకలను తల్లికీ, తండ్రికీ ఇచ్చాడు. వాడి తల్లి పండును కొరికి ఒక ముక్క తినగానే ఆమె జబ్బు కాస్తా తీసేసినట్టుగా పోయింది. తండ్రి కాయను పగలగొట్టితే అందులో పప్పులుండటానికి బదులు వజ్రాలున్నాయి!

* * *

ఒకసారి ఒక మరుగుజ్జు స్త్రీ ప్రసవిస్తూంటే ఒక కాపు స్త్రీ వెళ్ళి సహాయపడింది. ప్రసవం అయినాక మరుగుజ్జులు ఆమెకు కానుకగా కొన్ని బొగ్గులిచ్చారు.

తనకు అలాటి బహుమానం ఇచ్చినందుకు లోలోపల మండిపోతూ ఆ కాపుస్త్రీ వాటిని నిర్లక్ష్యంగా తన బట్టలో మూట కట్టుకుని ఇంటికి బయలుదేరింది. మూట వదులుగా కట్టటంచేత కొన్ని బొగ్గులు దారిలో పడిపోయాయి. ఆమె బొగ్గులన్నిటినీ అవతల పారేసి ఉండేదే, కాని మరుజ్జులు ఏమైనా అనుకుంటారని అలా చేయలేదు.

తీరా ఆమె ఇంటికి వచ్చి మూట విప్పి బొగ్గులను ఒకమూల గిరవాటు వేసేసరికి ఖంగుమని బంగారు నాణాలు మోగాయి. ఆమె తన నిర్లక్ష్యానికి ఎంతో విచారించి, పోయిన బొగ్గులకోసం వెతుకుతూ వచ్చిన దారినే వెళ్ళింది. కాని ఎక్కడా ఒక్క బొగ్గు గాని, బంగారు నాణెంగాని కనిపించలేదు.

* * *

ఒక లోయలో ఒక నదిఒడ్డున రాళ్ళ గుట్టలమీద ఉన్న ఇంట్లో ఒక మేదరవాడు



బుట్టలు అల్లి జీవిస్తూ ఉండేవాడు. వాడు చాలా బీదవాడైనప్పటికీ సుఖంగానే జీవిస్తూ ఉండేవాడు. మరుగుజ్జులు తరుచు వాడి ఇంట్లో సమావేశాలు చేస్తూ ఉండేవారు.

ఒక ఏడు వరదలు వచ్చి నది పొంగింది. మేదరవాడు తన ఇల్లు మునిగిపోతుందని భయపడి, తనకు గల కొద్ది వస్తువులూ నది అవతలి ఒడ్డుకు చేరవేశాడు. వాడు భయపడ్డట్టే నీరు ఇంట్లోకి ప్రవేశించసాగింది. ఇంతలో మేదరవాడికి ఒక ఆర్తనాదం వినపడింది. ఆ కీచుగొంతు చూస్తే అది మరుగుజ్జుదిలాగున్నది. మేదరవాడు తన ఇంటికేసి చూసేసరికి ఇంటి కప్పుమీద ఒక మరుగుజ్జు కనిపించాడు.

మేదరవాడు సాహసించి నదిని దాటి, మునిగిపోతున్న ఇంటిని సమీపించి, కప్పు నుంచి మరుగుజ్జును దించి, సునాయాసంగా ఇవతలికి చేర్చాడు.

"నువు నా ప్రాణం కాపాడావు. నీ ఋణం ఉంచుకోను. ఇదుగో, ఈ సంచీలో పచ్చి బటానీలున్నాయి, తీసుకో. వాటిని వండుకుని మీ కుటుంబమంతా తినవచ్చు. అయితే సంచీమాత్రం ఖాళీ చెయ్యకు. ఎప్పుడూ సంచీలో రెండు బటానీగింజలన్నా మిగిలి ఉండేటట్టు చూడు!" అంటూ మరుగుజ్జు మేదరవాడికి ఒక బటానీల సంచీ బహుమానంగా ఇచ్చాడు.

మేదరవాడికి ఆ బహుమతి ఏమీ నచ్చలేదు. అసలే వాడు తన వస్తువులు ఏమేమి పోయాయో అన్న విచారంలో ఉన్నాడు. ఆ రాత్రికి వాడు తన కుటుంబంతోసహా ఎవరి ఇంటనో తల దాచుకున్నాడు. తెల్లవారేసరికి నీరంతా తీసింది. అదృష్టవశాత్తూ వాడి ఇల్లు వరదకు కొట్టుకుపోలేదు. వాడు తన కుటుంబంతోసహా ఇంటికి తిరిగి వచ్చాడు. ఇల్లు శుభ్రం చేసుకుని, వంట చేయవలిసి వచ్చేటప్పటికి వాడికి బటానీలు ఎంతో ఉపయోగపడ్డాయి. మరుగుజ్జు చెప్పిన ప్రకారం

సంచీలో రెండు గింజలు మాత్రం మిగిల్చి మిగిలినవన్నీ వండుకుని తిన్నారు.

మర్నాడు ఉదయం చూస్తే సంచీనిండా బఠానీలున్నాయి. ఇదేవిధంగా ప్రతిరోజూ సంచీ దానంతట అదే నిండుతూండేది. దీనితో మేదర కుటుంబానికి రోజూ రుచికర మైన కూర, పుష్టికరమైనది, అందుబాటు లోకి వచ్చింది. ఇంటిల్లిపాదీ ఉత్సాహంతో బుట్టలు అల్లి వాటిని అమ్మి ఆ డబ్బులు వెనకవేసుకుంటూ సుఖపడ్డారు.

ఈ సంచీ ఆ మేదర కుటుంబంలో చాలా తరాలపాటు ఉన్నదట. ఒకనాడు ఒక కొత్త పంటలక్క సంచీ సంగతి తెలియక అందు లోని బఠానీలన్నీ తీసి వండేసిందట. ఆ తర వాత అది ఖాళీసంచీగా ఉండిపోయింది.

* * *

మరుగుజ్జులు ఆల్ప్స్ పర్వతాలను విడిచి పెట్టి పోవటానికి కారణం అక్కడి మను షులు వారికి చూపిన కృతఘ్నతా, అనా దరణా అని చెబుతారు. ఈ అనాదరణకు ఉదాహరణగా ఒక్క కథ చెబుతాను.

ఒకనాడు ఒక యువకుడు పొలానికి ఎరువు వేస్తూండగా కొందరు మరుగుజ్జులు సహాయం చేయవచ్చారు. మరుగుజ్జులు ధరించే బట్టలు నేలను తాకుతూ ఉండేవి. అందుచేత వారి పాదాలు కనిపించేవికావు. అయితే మరుగుజ్జుల పాదాలు బాతు పాదా లలాగా ఉంటాయని ఆ యువకుడు విని ఉన్నాడు. అది నిజమో కాదో తెలుసుకోవ టానికిగాను ఒక సున్నంబస్తాను ఆ ప్రదే శంలో కుమ్మరించాడు.

మరుగుజ్జులు మామూలు ప్రకారం యువకుడితో మాట్లాడి అతనికి అన్ని పనులూ చేసిపెట్టి వెళ్లిపోయారు. సున్నంలో వారి పాదాల గుర్తులు పడ్డాయి. అవి బాతు పాదాలలాగే ఉన్నాయి. కాని ఆ తరవాత ఆ ప్రాంతంలో ఎక్కడా మరుగుజ్జులు కనిపించిన పాపానపోలేదు.





# అహింసాజ్యోతి

## [13]

ఈ లోపుగా ఉజ్జయినిరాజు మందు మింగి, తాను తాగినది నూనె అని తెలుసుకుని, పట్టరాని ఆగ్రహం చెంది, "ఆ జీవకుణ్ణి పట్టుకుని కొరత వెయ్యండి!" అని ఆజ్ఞాపించాడు. అయితే జీవకుడు భద్రవతిపైన పరారీ అయాడని తెలిసింది. రాజు తన ప్రధాన బోయీ అయిన ఒప్పణికుడనేవాణ్ణి పిలిచి, "ఓరీ, నీవు జీవకుణ్ణి పట్టి తెస్తే గొప్ప బహుమానం ఇస్తాను!" అన్నాడు.

ఒప్పణికుడు కౌశాంబీనగరం చేరి జీవకుణ్ణి కలుసుకుని, "మహారాజుగారు మిమ్మల్ని రమ్మన్నారు!" అని చెప్పాడు.

"నాకు ఆకలిగా ఉన్నది. భోజనం చేసి బయలుదేరుతాను. నువుకూడా నాతోపాటు భోజనం చెయ్యి!" అన్నాడు జీవకుడు. ఒప్పణికు డిందుకు అంగీకరించలేదు. "పోనీ ఈ పండైనా తిను," అంటూ జీవకుడు ఒక పండును సగానికి కోసి ఒక సగం బోయీకిచ్చాడు.

ఆ పండు తింటూనే ఒప్పణికుడి శరీరం నీరసంగా అయిపోయింది, వాడు చేతులూ కాళ్ళూ కదల్చలేకపోయాడు.

జీవకుడు తాపీగా భోజనంచేసి, తన ఏనుగుకు నీరు పెట్టించి, ఒప్పణికుడి వద్దకు వచ్చి, "నన్ను రాజుగారి వద్దకు తీసుకుపోతానంటివిగదా, కదలవేం?" అన్నాడు.

"బాబూ, నన్ను మామూలు మనిషిగా చెయ్యండి, మీరెక్కడికి రమ్మంటే అక్క




డికి వస్తాను, ఏపని చెయ్యమంటే ఆ పని చేస్తాను!" అన్నాడు ఒప్పణికుడు.

"సరే అయితే ఆ మిగిలిన సగంపండూ తిను!" అన్నాడు జీవకుడు నవ్వుతూ.

"అమ్మబాబో! సగంపండు తింటేనే కాళ్ళూ చేతులూ చచ్చుపడిపోయాయే. అది కూడా తింటే పూర్తిగా చచ్చేపోతాను," అన్నాడు ఒప్పణికుడు.

"ఓరీ, నేనెప్పుడూ ఎవరి ప్రాణమూ తీయలేదు. శరీరం చచ్చుపడిపోయేటట్టు కూడా ఇంతకుముందెవరికీ చెయ్యలేదు. మామూలు మనిషివి అవుతావు. మిగిలిన పండు తిను!" అన్నాడు జీవకుడు.



అతని మాట నమ్మి ఆ ప్రకారమే చేసి ఒప్పణికుడు మామూలు మనిషి అయాడు. "ఇక నీవు ఉజ్జయినికి తిరిగి పో. రాజుకీపాటికి వ్యాధి నయమై ఉంటుంది. అందుచేత నిన్నేమీ అనడు!" అని ఒప్పణికుడితో చెప్పి జీవకుడు తన దారిన రాజగృహానికి వెళ్ళి బింబిసార మహారాజుకు జరిగిన సంగతి యావత్తూ తెలియజేశాడు.

ఇదంతా జరిగిన కొంత కాలానికి జీవకుడు బుద్ధుడికి చికిత్స చేయటం తటస్థించింది. అది ఇలా జరిగింది :

ఒకనాడు ఆనందుడు జీవకుడి వద్దకు వచ్చి బుద్ధుడికి సుస్తీగా ఉన్నదనీ, ఆయనను చూసి చికిత్స చేయమనీ అడిగాడు. జీవకుడు విహారానికి వెళ్లి బుద్ధుణ్ణి పరీక్ష చేసి ఆయన జబ్బుకు కారణాలు మూడు దోషాలని గ్రహించాడు. అందుకుగాను అతను మూడు ఔషధాలు తయారుచేసి, వాటిని మూడు కమలాలలో ఉంచి బుద్ధుడికిచ్చి, ఆ కమలాలను వాసన చూసినట్టయితే ఆరోగ్యం చక్కబడుతుందని చెప్పాడు. అలాగే బుద్ధుడికి ఆరోగ్యం చేకూరింది.

జీవకుడి చికిత్సవల్ల ఆరోగ్యం పొందిన చండప్రజోతుడు జీవకుడికి కానుకగా రెండు అమూల్యమైన శాలువలను పంపాడు.







వాటిలో ఒకదాన్ని తెచ్చి జీవకుడు బుద్ధుడికి కానుకగా సమర్పించాడు. బుద్ధుడు ఆనందుణ్ణి పిలిచి, "మన భిక్షువులకు ఇలాటి వెలలేని కానుకలు లభించినట్టయితే వారికి చోరభయం సంప్రాప్తమౌతుందేమో!" అన్నాడు.

ఆనందుడు జీవకుడిచ్చిన శాలువను ముప్పై ముక్కలుగా కత్తిరించి, అయిదేసి ముక్కలు కలిపి కుట్టి వస్త్రాలుగా తయారు చేశాడు. ఇదిచూసి బుద్ధుడు సంతోషించి, భిక్షువులెవరూ మూడేసి వస్త్రాలకన్న ఎక్కువ ఉంచుకోరాదనీ, వాటిలో ముప్పై అతుకులుండాలని శాసించాడు.

జీవకుడుకూడా బుద్ధుడి ఉపదేశం విని ఆయన శిష్యగణంలో చేరాడు. ఆయన బుద్ధుణ్ణి ముప్పూటలా చూడాలని కోరాడు. అయితే వేలువన విహారం చాలా దూరం అయిపోయింది. అందుచేత జీవకుడు తన తోటలోనే ఒక విహారం నిర్మించి బుద్ధుణ్ణి అక్కడికి వచ్చి ఉండమని కోరాడు. ఈ సంఘటనలు బుద్ధుడు బుద్ధత్వం పొందిన ఇరవయ్యో సంవత్సరంలో జరిగాయి.

* * *

కోసలదేశపు రాజువద్ద భార్గవుడనే పురోహితుడుండేవాడు. ఆయన భార్య గర్భిణిగా ఉండి ఒక మగశిశువును ప్రసవించింది. ఆక్షణంలో నగరమంతటా కత్తికటార్లు ధగధగా మెరిశాయి. పురోహితుడీ వింత చూసి ఆశ్చర్యపడి ఒక జ్యోతిష్కుడివద్దకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పాడు. జ్యోతిష్కుడు పిల్లవాడి జాతకచక్రం వేసి, "ఈ జాతకుడు గజదొంగ అవుతాడు!" అన్నాడు.

మర్నాడు ఉదయం పురోహితుడు రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, రాత్రి మీరు సుఖంగా నిద్రపోయారా?" అని అడిగాడు.

"లేదు. రాత్రల్లా నా కత్తి మెరుస్తూనే ఉన్నది. నాకో, దేశానికో ఆపద కలిగేలా గుంది," అన్నాడు రాజు.



"మహారాజా, నాకొక కుమారుడు కలిగాడు. వాడు పుట్టగానే, మీకత్తే కాదు, నగరంలో ఉన్న సమస్తమైన ఆయుధాలూ మెరిశాయి. నా కొడుకు గజదొంగ అవుతాడని జ్యోతిష్కులు చెబుతున్నారు. వాణ్ణి వెంటనే కడతేర్చమని సెలవా?" అన్నాడు పురోహితుడు.

"అబ్బే, ఒక్క మనిషి దేశానికి ఏపాటి ప్రమాదం చెయ్యగలడు. వాణ్ణి పెంచి పెద్ద వాణ్ణి చెయ్యి," అన్నాడు రాజు.

ఆ కుర్రవాడికి అహింసకుడని పేరుపెట్టి పెంచి పెద్దవాణ్ణి చేశాడు పురోహితుడు. చదువుకునే ఈడు రాగానే అహింసకుడు తక్షశిలకు వెళ్లి ఒక గురువుదగ్గిర విద్యాభ్యాసం ఆరంభించాడు. మిగిలినవారందరినీ వాడు చదువులో మించిపోయాడు. ఆది చూసి ఇతర శిష్యులు అసూయ చెంది వాడికి ఎలాగైనా శాస్తి చేయాలని నిశ్చయించి కూడబలుక్కున్నారు.

ఆ తరవాత కొందరు వెళ్లి గురువుగారితో, అహింసకుడికీ గురువుగారి భార్యకూ ఏదో సంబంధం ఉన్నట్టు చాడీ చెప్పారు. గురువుగారు ఇది నిజమేనా అని మిగిలినవాళ్లను అడిగితే నిజమే నన్నారు వాళ్లు. గురువుగారు ఈ మాటను నమ్మలేక, నమ్మకుండానూ ఉండలేక, తన భార్య అహింస



కుడిపట్ల ఎలా ప్రవర్తించేదీ గమనించ సాగాడు. పాపం, ఆవిడ వాణ్ణి ఎంతో ఆప్యాయంగా చూసేది; ఆమెకు శిష్యులు చేస్తున్న కుట్రగురించి ఏమీ తెలియదు.

చిట్టచివరకు గురువుగారికి అహింసకుడిపైన మాత్సర్యం ఏర్పడింది. వాణ్ణి చంపేద్దామనుకున్నాడు గాని, ఈ సంగతి తెలిస్తే తనదగ్గిర చదువుకోవటానికి ఎవరూ రారని భయపడ్డాడు. అందుచేత ఆయన అహింసకుణ్ణి పిలిచి, "ఇక నేను నీకు చదువు చెప్పేదిలేదు. నీకు నిజంగానే చదువుకోవాలని ఉంటే వెయ్యిమంది మనుషులను హత్యచేసి, దానికి నిదర్శనంగా వారి చేతివేలు ఒక్కొక్కటి చొప్పున కోసితెచ్చి నాకు చూపించు. అప్పుడు చదువు చెబుతాను!" అన్నాడు.

"అయ్యా, ఇతరులకు హాని చెయ్యటం మా వంశాచారం కాదు. కాని నాకు చదవాలని అభిలాష బలంగా ఉన్నది. వెయ్యిమందిని చంపితేగాని చదువు చెప్పనంటున్నారు గనక, ఇది మీ అజ్ఞగా భావించి వెయ్యిమందినీ హత్యలుచేసి వెయ్యివేళ్లు మీకు తెచ్చి సమర్పించుకుంటాను," అని అహింసకుడు అరణ్యానికి వెళ్లిపోయాడు. ఆ అరణ్యంలో ఎనిమిది దార్లు కలిసేచోట వాడు పొంచిఉండి అటుగా వచ్చేవారంద





రినీ హత్యచేసి చచ్చిన ప్రతిమనిషి వేలూ ఒకటి కోసి తనవద్ద పెట్టుకున్నాడు.

ఇందువల్ల వాడికి అంగుళిమాలుడు అని పేరు పచ్చింది.

ఇలా అనేక హత్యలు జరిగి ప్రజలలో కలవరం పుట్టగా కొందరు రాజుగారివద్దకు వెళ్లి, "మహాప్రభూ, ఎవడో గజదొంగ అరణ్యంలో చేరి అటుగా వెళ్లినవారినల్లా చంపేస్తున్నాడు. తమరు సైన్యంతోసహా వెళ్లి వాణ్ణి నాశనం చెయ్యకపోతే దేశం నిర్జనమై పోతుంది," అని మొరపెట్టుకున్నారు. రాజుగారు వారు కోరినప్రకారం సైన్యాన్ని పంపి అంగుళిమాలుణ్ణి చంపెయ్య నిశ్చయించారు.



ఈ వార్త నగరమంతా పాక్కింది. పురోహితుడుకూడా సంగతంతా విని తన భార్యతో, "ఈ అంగుళిమాలుడు మన పిల్లవాడే అయి ఉంటాడు. వాణ్ణి సైనికులు చంపేస్తారు. ఏం చేద్దాం?" అన్నాడు.

"రాజుగారు వెళ్లేలోపలే మీరు వెళ్లి మన వాణ్ణి మంచిగా ఇంటికి తెచ్చెయ్యండి," అన్నది పురోహితుడి భార్య.

"నేను వెళ్లను! దొంగనూ, చెట్టు కొమ్మనూ, రాజునూ, ఆడదాన్నీ నమ్మరాదని శాస్త్రం!" అన్నాడు పురోహితుడు.

"అయితే నేనే వెళతాను!" అంటూ పురోహితుడి భార్య బయలుదేరింది.

ఈలోపుగా అహింసకుడు తొమ్మిదివందల తొంభైతొమ్మిది హత్యలు చేసి చచ్చినవారి వేళ్లు సంపాదించాడు. ఇంకొక్క మనిషిని హత్యచేస్తే వాడికి గురువుగారి రుణం తీరి పోతుంది. ఎవరు కనిపిస్తే వారిని చంపటానికి సిద్ధపడి వాడు అరణ్యంలో ఒక చోట పొంచి ఉన్నాడు.

నిజానికి వెయ్యోమనిషి వాడి తల్లి కావలిసిందే. కాని ఆమె అరణ్యంలోకి వచ్చే లోపుగా బుద్ధుడు అటుకేసి రావటం జరిగింది. దారిలో కొందరు గొర్రెలకాపర్లు బుద్ధుణ్ణి చూసి, "స్వామీ, అటుగా వెళు





తున్నారా? ఆ దారిన నలభై, యాభైమందికి తక్కువ సంఖ్యలో వెళ్లటానికి ఎవరూ సాహసించరు. అక్కడ గజదొంగ ఉన్నాడు, ఒంటరిగా చిక్కినవారందరి ప్రాణాలూ తీస్తాడు!" అన్నారు.

కాని బుద్ధుడు ఆ గొర్రెలకాపరుల హెచ్చరికలు లక్ష్యపెట్టకుండా అరణ్యంలో ముందుకు నడిచాడు.

అంగుళిమాలుడు దూరానే సన్యాసిని ఒకణ్ణి చూసి, "ఈ మనిషిని చంపేశానంటే నా పని పూర్తి అవుతుంది!" అని సంతోషించాడు. నిజానికి వాడికిది మంచి అవకాశంగా కనబడింది. ఎందుకంటే వాడు లోగడ చేసిన హత్యల ఫలితంగా మనుషులు జాగర్తగా మసులుకుంటూ వాడికి అందకుండా తిరుగుతున్నారు.

బుద్ధుడు నడిచిపోతుంటే ఆయనను అందుకోవటానికి అంగుళిమాలుడు వెంటపడ్డాడు. వాడు ఎంత వేగంగా పరిగెత్తినా ముందుపోతున్న బుద్ధుణ్ణి కలుసుకోవటం సాధ్యంకాలేదు. "నేను పరుగు తీసి గుర్రాలనూ, ఏనుగులనూ, రథాలనూ కూడా అందుకున్నాను, కాని ఈ సన్యాసి అందడేమిటి?" అని వాడు లోపల ఆశ్చర్యపడుతూ, "ఓ సన్యాసీ, ఆగు!" అని ఎలుగెత్తి కేకపెట్టాడు.

బుద్ధుడు ఆగి, "నువ్వుమాత్రం నా దగ్గిరికి రాకు!" అన్నాడు. తరవాత ఆయన వాడికి భూతదయను గురించీ, హింసచేసేవారు అనుభవించే నరకాలను గురించీ బోధచేశాడు.

బుద్ధుడి మాటలు వింటున్నకొద్దీ అంగుళిమాలుడి మనసులో ఏదో పరివర్తన వచ్చేసింది. వాడు పూర్వజన్మలో చేసుకున్న పుణ్యమంతా ఒక్కసారిగా పండి పక్వానికి వచ్చినట్టయింది. వాడు అప్పటికప్పుడే బుద్ధుడికి శిష్యుడై ఆయన వెంట జేతవనానికి వెళ్ళాడు. —(ఇంకా వుంది)



# 2. కుతుబ్ మినార్

కుతుబ్ మినార్ ప్రపంచంలోని గోపురాలన్నిటి లోకీ నిర్దుష్టమైనదిగా భావించబడుతున్నది. ఢిల్లీ నగరానికి దక్షిణంగా 10, 11 మైళ్ళ దూరంలో ఉన్న ఈ స్తంభాన్ని కుతుబుద్దీన్ ఐబక్ (బానిస వంశ రాజు) సుమారు 1200 ప్రాంతంలో ప్రారంభించాడు. దీని ఎత్తు 238 అడుగులు. ఇది ఐదు అంతస్తుల కట్టడం. దీనిలో 378 మెట్లున్నాయి. అడుగుభాగంలో ఇది 47 అడుగుల మందం కలిగి ఉన్నది.

దీనిని ఎర్రరాతితోనూ, చలవరాతితోనూ నిర్మించారు. అడుగుభాగం 20 పలకలు కలది. ఒక పలక వంపు తిరిగి, మరొక పలక కోణం కలిగి ఉంటుంది. రెండవ అంతస్తు పలకలన్నీ వంపు తిరిగి ఉంటాయి. మూడవ అంతస్తు పలకలన్నీ కోణాలు గలవి. పై రెండు అంతస్తులూ పలకలు లేకుండా ఉంటాయి. వీటిని ఫిరోజ్‌షా పునర్నిర్మించాడట.

ప్రతి అంతస్తు చుట్టూ ఒక విశాలమైన బాల్కనీ, అందమైన నగిషీలతోనహా ఏర్పాటయి ఉన్నది. కుతుబ్ మినార్ పైభాగంలో ఒక శిఖరంలాటిది ఉండేదట. 1803 లో కలిగిన భూకంపం మూలాన అది పడిపోయింది.

కుతుబ్ మినార్ నరసనే 4 వ శతాబ్దంనాటి ఇనప స్తంభం ఒకటి ఉన్నది. దీని వ్యాసం 16 అంగుళాలు, ఎత్తు 23 అడుగుల 8 అంగుళాలు. దీనిపై చంద్రగుప్త విక్రమాదిత్యుడి కైవారాలు లిఖించి ఉన్నాయి.






2. మృగరాజు

స్వేచ్ఛాజీవులైన మృగాలన్నిటిలోకీ సింహం రాజసటానికి ఎలాటి సందేహమూ లేదు. దాని ఠీవీ, వాలకమూ రాజోచితమైనవి. దాని చూపుకూడా గంభీరంగా, ఆత్మవిశ్వాసంతో కూడి ఉంటుంది. అరణ్యంలోనూ, పొదలప్రాంతంలోనూ సింహాలు గుంపులుగా జీవిస్తాయి. తరుణం వచ్చిన సింహాలు తమ గుంపును వదిలివెళ్లి దాంపత్యాలు ఏర్పాటు చేసుకుంటాయి. ఆడసింహాలు ఒక మగ సింహానికి పిల్లలను కన్నాక యావజ్జీవం ఆ మగసింహంవెంటే ఉంటాయి. సింహపు పిల్లలు రెండేళ్లు నిండినదాకా తల్లిదండ్రుల వెంట ఉండి వేటనైపుణ్యాన్ని అలవరుచుకుంటాయి.

సింహాలు హెచ్చువేడికి తట్టుకోలేవు. పగటి ఎండవేళ అవి ఏ గడ్డి నీడనో, అరణ్యంనీడనో చూచుకుని పడుకుంటాయి. నిర్బంధంలో ఉన్న సింహాలు చనిపోయేది హెచ్చుగా వేసవికాలంలోనే. అంతగా, ఈదురుగాలి లేని పక్షంలో అవి చలికి బాగానే తట్టుకోగలవు.

ఉత్తర ఆఫ్రికాపర్వతాలలో "అట్లాస్" సింహాలుండేవి. అవి చాలా పెద్దవి. అయితే ఈ జాతి ఇప్పుడు నశించిపోయింది. నల్లని జూలుగల పెద్దపెద్ద సింహాలు ఆఫ్రికా పీఠభూమిలోనూ, అబిసీనియా మైదానాలమీదా ఇప్పటికీ నివసిస్తున్నాయి.

సింహాలు మాంసభక్షణతో జీవించేవి కావటంచేత సాయంకాలంవేళ వేటకు బయలుదేరుతాయి. తాము వేటాడే మృగాలు దప్పితీర్చుకునేటందుకు వచ్చే ప్రదేశంలో అవి పొంచి ఉంటాయి. అవి దుప్పులతోనూ, జిరాఫ్‌లతోనూ సమంగా పరిగెత్తలేవు. అందుచేత అవి మొదటి దెబ్బ తప్పి

జిమ్ ఫ్రే

కుని పారిపోయినట్టయితే సింహాలు వాటిని వెంబడించే ప్రయత్నం చెయ్యక, మరొక జంతువు దాపులకు వచ్చేదాకా కనిపెట్టుకుని కూచుంటాయి.

ఇందులో సింహాలను శిక్షణచేసేవాడు గ్రహించదగిన విషయమేమంటే, వాటిచేత ఎక్కువసేపు పనిచేయించగూడదు. అవి అతిత్వరగా అలిసిపోతాయి. అలిసినమీదట పనిచేయిస్తే వాటికి చిరాకుకలిగి అవి ఎదురు తిరగవచ్చు. తిరగబడిన సింహాన్ని లొంగదీయటానికి దాని అలసట ఎంతో ఉపయోగిస్తుంది. తిరగబడిన సింహాన్ని వెంటనే అదుపుచెయ్యటానికి యత్నించక, పంగల కర్రతోగాని, పీటకాళ్లతోగాని దాన్ని దూరంగా ఉంచి ఆత్మరక్షణ చేసుకున్నట్టయితే ఇరవై సెకండ్లకాలంలో అది అలిసిపోతుంది. దాని పంజావిసురు బలహీనపడగానే అది అలసిపోయిందనుకోవచ్చు. ఆ సమయంలో దాని ముక్కుమీద కొరడాకోలతో ఒక్క చురుకు తగిలించి, " ఇక ఎన్నడూ ఇలా చెయ్యకు !" అన్నట్టుగా దానికి బుద్ధి చెప్పవచ్చు.

తిండి తిన్నవెంటనే వాటి ప్రశాంతతకు భంగంకలిగినా, వాటిచేత పని చేయించినా సింహాలు బొత్తిగా సహించవు. తిండితిన్న సింహాలచేత పనిచేయించటం కొరివితో తల



గోక్కవటమే. అభ్యాసానికిగాని, ప్రదర్శనానికిగాని వాటిచేత పనిచేయించదలిస్తే తిండి తినకపూర్వమే చేయించాలి. పని అయిన తరవాత మాంసంముక్కలు దొరికితే అది పనిచేసినందుకు బహుమానంగా కూడా వాటికి తోస్తుంది.

నేను అనేక వారాలపాటు అనేక సింహాల గుంపులను పరిశీలించాను. అవి వేటాడేటప్పుడు తప్పించుకుపోయిన జంతువు వెంటపడవని చెప్పాను. ఇది మగసింహాలకు మరింత బాగా వర్తిస్తుంది. అవి ఎప్పుడూ మాటున పొంచిఉంటాయి. ఒకసారి నేనొక దృశ్యం చూశాను. మాటున మగ



సింహం పొంచి ఉన్నది; కొన్నిగజాల దూరాన ఒక దుప్పి నీరు తాగుతున్నది. ఒక్క క్షణంపాటు సింహం దూకబోయే దానిలాగా వెనకకాళ్లపైన కొద్దిగా ఊతం పెట్టింది. అయితే అది దూకనేలేదు; దుప్పిని నీరు తాగి వెళ్లిపోనిచ్చింది. నా నమ్మకం అది కేవలం బద్ధకంచేతనే అలా చేసిందని. మరి కొంచెంసేపట్లో ఆడసింహం ఏ అడివిదున్ననో, మరొక జంతువునో కొట్టి తెచ్చి తనను పిలుస్తుందనీ, శ్రమపడి దుప్పిని పట్టటం అనవసరమనీ అది అనుకుని ఉంటుంది. సింహాలవంటి సోమరిపోతు జంతువు సృష్టిలో లేదు.



ఒక్కొక్క సింహంకుటుంబంలోనూ సుమారు డజను జంతువులుంటాయి. వాటి మధ్య సంబంధ బాంధవ్యాలూ, ప్రవర్తనా నియమబద్ధంగా ఉంటుంది. కుటుంబంలో ఏ ఒక జంతువు నియమాన్ని తప్పినా సింహాల పెద్ద శిక్షిస్తుంది.

ప్రతిసారీ ఒకే ఆడసింహం ఆహారాన్ని వేటాడి తెస్తుంది. అది ఆహారం తెచ్చి గర్జించగానే మిగిలిన సింహాలన్నీ తినటానికి వస్తాయి. ఇందులో కూడా సింహాలను తరిఫీదు చేసేవాడు తెలుసుకోదగిన గుణపాఠం ఉన్నది. ఇతర వన్యమృగాలతో పని చెయ్యటంకంటె సింహాలతో పనిచెయ్యటంలో హెచ్చు ప్రమాదం ఉన్నది. ఒక సింహం ఆడించేవాణ్ణి కింద పడదోయగానే మిగిలిన సింహాలు వాటి సహజ స్వభావాన్ని బట్టి తిండికి వచ్చి మీద పడిపోతాయి.

సింహాల మందకు కడుపుల్లో ఆకలి ఆరంభం కాగానే ఆడసింహం వేటకు బయలుదేరి పోతుంది. అది తనకు కావలిసిన మృగం కనిపించగానే దాన్ని వెన్నాడుతుంది. గుంపులోని ఇతర సింహాలు ఆ మృగాన్ని చుట్టుముట్టి పట్టి ఇస్తాయి. వేటాడేటప్పుడు సింహం తన సహజ స్వభావం పైన మాత్రమే ఆధారపడుతుంది. దానికి



సూక్ష్మమైన వాసనశక్తి లేదు. ఈ విషయాన్ని నేను స్వయంగా రుజువు చేశాను. నేను చేతిలో మాంసంముక్క పట్టుకుని వెనక పెట్టుకుంటే నాకు ఎదురుగా కొద్ది అడుగుల దూరంలో ఉన్న ఆడసింహమూ మగసింహమూ తెలుసుకోలేకపోయాయి. మాంసాన్ని చూసిన తరవాతనే వాటికి దానియందు ఆసక్తి పుట్టింది.

సింహాలను ఆడించేవారు చాలామంది మగసింహాలకంటె ఆడసింహాలను ఆడించగోరుతారు. ఆడసింహాలది ఎక్కువ శాంత స్వభావమన్న మాట నిజమేగాని, మనం ఆడించేది సింహాల గుంపులో వేటాడే ఆడసింహమైతే చాలా హెచ్చు ప్రమాదం ఉన్నది. నా అనుభవాన్నిబట్టి చెప్పాలంటే మటుకు నన్ను గాయపరిచినవన్నీ ఆడసింహాలేగాని మగసింహాలు కావు. ఆడసింహాలు ఎప్పుడు ఎదురుతిరిగేదీ ఊహించటం చాలా కష్టం; అందుచేత ఆత్మరక్షణ కూడా కష్టమే.

ఒక్క పెద్దపులి తప్ప మిగిలిన "అడవి పిల్లులు" ఋతుకాలంలో ప్రమాదకరంగా ఉంటాయి. ఆ సమయంలో వాటితో ప్రదర్శన లివ్వకుండా ఉండటం క్షేమం. ఒక్కొక్కసారి అనుకోని ప్రమాదాలుకూడా జరుగుతాయి. వెలపల తుపాకి పేల్చిన



చప్పుడు కావచ్చు, ఆకాశం ఉరమవచ్చు, ప్రేక్షకులు ఒక్కసారిగా కరతాళధ్వనులు చేయవచ్చు, అలవకు సమీపంలో అపరిచిత వస్తువులుగాని, ఒక పిల్లిగాని, కుక్కగాని కనిపించవచ్చు; ఇవన్నీ జంతువులను కలవరపరిచేవే. కొన్నికొన్ని వాసనలుకూడా వాటిని కలవరపరుస్తాయి.

*　　*　　*

కొన్నికొన్ని నగరాలు ప్రమాదభరితంగా కనిపిస్తాయి. నామటుకు నాకు వియన్నా అచ్చిరాలేదు. అక్కడ నేను జబ్బుపడ్డాను; నా జంతువులు తమలో తాము యుద్ధాలు చేసుకుని, వాటిని అదుపులోకి తేవటానికి నీటి గొట్టాలు ఉపయోగించవలిసి వచ్చింది; అవి చెప్పినట్టు వినక మొండికెత్తటం జరిగింది. ఒకనాటి రాత్రి నేను సింహాలతో గుట్ట (పిరమిడ్) నిర్మించి ప్రేక్షకుల హర్షాభినందనలు అందుకుంటున్నాను, సింహాలు దిగి వస్తున్నాయి. సరిగా ఆ క్షణంలో లైట్లు కాస్తా ఆరిపోయాయి. అంధకారమైపోయేసరికి ప్రేక్షకులుకూడా కలవరపడ్డారు. ఆ సమయంలో నాదగ్గిర ఉన్న సింహాలలో "నేగస్" అనే ముసలి మగసింహం చాలా కోపిష్టిది; అవకాశం దొరికినప్పుడల్లా దాని అక్కసు ప్రదర్శిస్తూ ఉండేది. అదృష్టవశాత్తూ నాకు సింహాల కదలిక కనిపించేపాటి వెలుతురు ఉన్నది. ప్రమాదం రాబోతున్నదని ఎలాగో "పసికట్టి" నేను అలవ ఎగబాకాను. మరు క్షణమే నేగస్ శరీరం ధన్‌మని అలవకేసి కొట్టుకున్నది. ఒక్క క్షణం ఆలస్యమైతే అది నాపై దూకిఉండేది! ఈలోపల నా సహాయకులు టార్చీలు వెలిగించారు. వాటి వెలుతురులో నేగస్ నా కాళ్ళు అందుకోవటానికి ప్రయత్నిస్తూఉండటం కనిపించింది. నేను కొరడా కోలతో దాని ముక్కుపైన బలంగా ఒక్కటి ఇచ్చుకున్నాక అది ఆ ప్రయత్నం మానుకున్నది.

—["జంతు శిక్షణ" పైసంచికలో]






# "తేనెతిత్తులు"

మనం లోగడ అనేక రకాల చీమలను గురించి తెలుసుకుని ఉన్నాం. కాని వాటి అన్నిటికన్న వింత అయిన చీమలను గురించి ఇప్పుడు తెలుసుకుందాం. ఇవి మెక్సికో దేశానికి చెందిన "తేనెతిత్తి" చీమలు. వీటి జీవితవిధానం ఊహకు సులువుగా అందేది కాదు.

అమెరికాలోని కొలరాడో రాష్ట్రంలోని గులకరాతి నేలలో వీటి పుట్టలను పరిశోధించి అద్వితీయమైన వీటి జీవిత వివరాలను పరిశోధకులు సేకరించారు. వీటి పుట్టలు భూమి అడుగున ఉంటాయి. వాటి లోపలిభాగాలూ, వాటికి వెళ్ళేమార్గాలూ అమిత నున్నగానూ, శుభ్రంగానూ ఉంటాయి. మనం పుట్టలో ప్రవేశించి ఈ దారుల వెంబడి వెళ్లగలిగినట్టయితే ఒక చీకటికొట్టు వస్తుంది. అది ఈ చీమల ఆహారపు కొట్టు. ఈ కొట్టు పైభాగం నుంచి తేనె సంచులు, ఎండకు ఎదురుగా పట్టుకున్న ద్రాక్షపళ్లలాగా నిగనిగలాడుతూ కనిపిస్తాయి. అయితే అవి మామూలు సంచులు కావు—ప్రాణాలతో ఉన్న చీమలే! అవి పైకప్పును తమ కాళ్లతో పట్టుకుని వేళ్లాడుతూ ఉంటాయి. తేనె కొట్టు నున్నగా గచ్చుచేసినట్టు ఉన్నప్పటికీ దాని కప్పు మాత్రం గరుకుగా, "తేనె తిత్తు"లకు పట్టు చిక్కేలాగా ఉంటుంది. తేనె తిత్తులు మసులుతూ ఉంటాయి, తలలు తిప్పి అటూ ఇటూ చూస్తాయిగాని పట్టుమాత్రం విడవవు.

మధ్యమధ్య ఇతర చీమలు వచ్చి తమకు ఆహారం కావలిసినప్పుడు కప్పుకు ఎగబాకి కప్పునుంచి వేళ్లాడే "తిత్తుల"ను తేనె అడుగుతాయి. అప్పుడు తిత్తులు తమ పొట్టలలో ఉండే తేనెను పైకి తెప్పించి అడిగిన చీమకు పెట్టేస్తాయి.

ఒక్కొక్కప్పుడు పనిచేసే చీమలు తేనె తీసుకువస్తాయి. అప్పుడు "తిత్తులు" నోళ్లు



తెరిచి ఆ తేనెను స్వీకరించి తమ పొట్టలలో నింపుకుంటాయి. "తేనె దుత్తలు"గా తమ సాటి చీమలకు ఉపకరించటం తప్ప ఈ "తిత్తు" లకు వేరే జీవితం ఏదీ లేదు.

అన్ని చీమలూ తేనె తిత్తులుగా మారవు. కొన్ని చీమలు తమ బాల్యంలోనే తేనె తిత్తులు అయిపోవటానికి నిర్ణయించుకుంటాయి. ఈ నిర్ణయం ఏ సూత్రం ప్రకారం జరిగేదీ మనకు స్పష్టంగా తెలియదు. "తేనెతిత్తి" కాదలిచిన చీమ జీవితం ఇతర చీమలనుంచి స్వీకరించిన తేనెను తన పొట్టలో నింపుకుని, కప్పునుంచి వేళ్లాడటంతో ప్రారంభమవుతుంది. దాని పొట్ట విప



రీతంగా విస్తరించి, గాలి నించిన బెలూనులాగా అయి, చిన్న దెబ్బ తగిలితే చితికిపోతుందా అన్నట్టుగా ఉంటుంది. ఇవి ఇతర చీమలు చేసే పనులేవీ చేయవు.

ఈ జాతి చీమలు తమ నివాసాలను శుభ్రంగా ఉంచుతాయి. కొన్ని సాయంకాలంవేళ బయలుదేరి తెల్లవార్లూ తేనె సేకరిస్తాయి. కొన్ని పుట్టకు కాపుంటాయి. తేనెతో తిరిగివచ్చిన చీమలనుంచి పుట్టలో ఉండే ఇతర చీమలూ, పిల్లచీమలూ తమకు కావలసిన తేనెను స్వీకరిస్తాయి. పిల్లలలో కొన్ని ఎంత తేనె తాగినా తృప్తి చెందినట్టు కనబడవు; ఇవి "తేనె తిత్తులు" కాబోతున్నాయన్నమాట!

తాము తెచ్చిన తేనెను పుట్టలోని ఇతర చీమలు ఆరగించగా మిగిలినదాన్ని చీకటి కొట్టులో ఉన్న "తేనె తిత్తుల"లో నించటం జరుగుతుంది. తేనెను అధికంగా స్వీకరించిన "తిత్తి" నిశ్చలంగా ఉంటుంది. అది చెయ్యా, కాలూ, తలా కదిలించటానికీ, చివరకు గట్టిగా ఊపిరి తీయటానికి కూడా భయపడినదానిలాగా కనిపిస్తుంది.

"తేనె తిత్తులు" అలాగే కప్పును కరుచుకుని ఏళ్లతరబడి వేళ్లాడి తమ జీవితం వెళ్లబుచ్చుతాయి. అయితే ఒక్కొక్క





"తిత్తి" తాత్కాలికంగా చాలాభాగం ఖాళీ కావటం జరిగితే అది కప్పు మీదినుంచి కిందికి దిగివచ్చి బయటి "నడవ"లోకి తొంగి చూడవచ్చు.

సాధారణంగా ఒక్కొక్క చీమల పుట్టకు పదేసి చీకటికొట్లూ, ఒక్కొక్క కొట్టులో సుమారు ముప్ఫై తేనె తిత్తులూ ఉంటాయి. ప్రతి చీమకూ రెండేసి పొట్ట లుంటాయనీ, వాటిలో ఒకటి చీమకు సొంత మనీ, రెండవది సాముదాయకమైనదనీ మనం ఎరుగుదుము. "తేనె తిత్తి" తాను తేనె తాగదలుచుకున్నప్పుడు ఒకటి, రెండు చుక్కల తేనెను సాముదాయకపు పొట్ట అయిన "తిత్తి" నుంచి తన సొంత పొట్టకు పంపకం చేసుకుంటుంది. కాని "తేనె తిత్తు"లలో ఉండే తేనెలో సొంతానికి ఉప యోగపడేది బహు కొద్ది.



"తేనె తిత్తులు"గా మారిపోయిన చీమ లకు పనిచేసే శక్తి, కదలాలనే కోరికా పోయినట్టుగా కనిపిస్తుంది. అయితే అప్పు డప్పుడూ అవి కప్పును తమ వెనక కాళ్లతో పట్టుకుని మధ్యకాళ్లతో తమ శరీరాలను శుభ్రంచేసుకుంటాయి. ఒకవేళ అవి తమను తాము శుభ్రం చేసుకోకపోయినా ఇతర చీమలు వచ్చి "తేనెకొట్టు" యావత్తూ శుభ్రంచేసి, "తేనెతిత్తు" లన్నిటినీ తుడిచి వెళ్లుతూంటాయి.

కొత్త "తేనెతిత్తులు" ఏర్పాటవుతూ ఉంటే పాతవి పోతూఉంటాయి. అనేక ఏళ్లుగా కప్పును పట్టుకుని వేళ్లాడుతూ ఉండిన "తేనెతిత్తి" ఒకటి పట్టు తప్పి కిందపడి కాళ్లూ, తలా కొట్టుకుంటుంది. అరుదుగా అది బోర్లాపడగలుగుతుంది. అప్పుడది ఎంతో ప్రయాసతో నున్నటి గోడ లను పట్టుకుని పాకుతూ కప్పును చేరుకుని మళ్లీ ఎప్పటిలాగే వేళ్లాడుతుంది.

సాధారణంగా అది బోర్లాపడలేదు. నేల మీదనే ఉండి కాళ్లు తన్నుకుంటుంది.



మిగిలిన చీమలు ధానికి అన్ని సపర్యలూ చేస్తాయిగాని మోసుకుపోయి కప్పుకుమాత్రం చేర్చవు. ఆ విధంగా అది రెండు మూడు నెలలపాటు అలాగే ఉండిపోవటంకూడా జరుగుతుంది. తరవాత అది చనిపోతుంది.

ఒక్కొక్కప్పుడు చీమ కప్పునుంచి పడగానే తిత్తి చిట్లిపోతుంది. ఇలా చిట్లిన తిత్తి తిరిగి దానంతట అదే సరికావచ్చు. చీమ తిరిగి కప్పును చేరిపోవచ్చు. తిత్తి పగిలి తేనె నేలపై ఒలకటం జరిగితే ఆ వాసనకు చీమలన్నీ వచ్చి ఒలికిన తేనెను ఆరగిస్తాయి. ఇంకా ఏమైనా మిగిలిపోతే దానిని కప్పున వేళ్లాడే "తేనెతిత్తుల"లో నింపుతాయి.

ఒక్కొక్కసారి "తేనెతిత్తులు" కప్పును కరుచుకునిఉండే చనిపోతాయి. మిగిలిన చీమలు ఆ సంగతి వెంటనే తెలుసుకోలేవు. అవి మిగిలిన "తేనెతిత్తుల"తోబాటు చనిపోయినదాన్నికూడా శుభ్రంచేస్తాయి. తేనె పెట్టమని గాని, తీసుకోమని గాని ఇతర చీమలు చనిపోయిన తిత్తివద్దకు వస్తే అది నోరు తెరవనప్పుడు వాటికి అనుమానం తగులుతుంది. వరుసగా అనేక చీమలు వచ్చి, "నోరు తెరు!" అని దాన్ని అడుగుతాయి. కాని అది నోరు తెరవదు. అప్పుడది చనిపోయినట్టు రూఢి అవుతుంది.

చనిపోయిన "తేనెతిత్తుల"కు శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరుగుతాయి. కొన్ని చీమలు కప్పును ఎక్కి చచ్చిన చీమ తాలూకు తిత్తిని కొరికి కత్తిరించి కింద పడేస్తాయి. తరవాత ఆ తిత్తిని నడవల వెంబడి ఒక ప్రత్యేక శ్మశానానికి తీసుకుపోయి, అక్కడ లోగడ ఉంచిన ఇతర తిత్తుల సరసను చేర్చుతాయి. ఆ తరవాత కప్పును పట్టుకునిఉన్న కాళ్లను ఉపాయంగా సడలించి మిగిలిన చీమభాగాన్నికూడా కింద పడేసి దాన్నికూడా తిత్తితోబాటే "సమాధి" చేస్తాయి. ఈ అంత్యక్రియలలో అనేక చీమలు పాల్గొంటాయి.



# 9. సెంట్రల్ రోడ్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, ఢిల్లీ

వర్తక వ్యాపారాలు రవాణాలపైనా, రవాణాలు రోడ్లపైనా ఆధారపడతాయి. 5 వేల సంవత్సరాలక్రితం మహెంజొదారోలో కూడా మన పూర్వీకులు రోడ్లు నిర్మించారు. అయితే ఈనాడు మన దేశం రోడ్ల అభివృద్ధిలో చాలా వెనకపడి ఉన్నది. మన దేశపు విస్తీర్ణం 11 లక్షల చదరపు మైళ్ళకు పైబడి ఉన్నది, కాని మన రోడ్ల నిడివి 2,55,460 మైళ్ళు మాత్రమే. 94,000 చదరపు మైళ్ళ విస్తీర్ణం గల గ్రేట్ బ్రిటన్‌లో 1,84,000 మైళ్ళ రోడ్లూ, 30 లక్షల చదరపు మైళ్ళ విస్తీర్ణం గల అమెరికాలో 30 లక్షల మైళ్ళ నిడివిగల రోడ్లూ ఉన్నాయి. జనాబాను బట్టి చూసినా మన దేశం వెనకే ఉన్నది. ఇక్కడ వెయ్యిమంది జనాభాకు ముప్పాతిక మైలు రోడ్డు మాత్రమే; బ్రిటన్‌లో 1000 జనాభాకు 3.6 మైళ్ళ రోడ్డూ, అమెరికాలో 21 మైలు రోడ్డూ ఉన్నాయి.

అదంతా అలాఉంచి మన రోడ్లు ఏమాత్రమూ బాగాలేవు. అందుచేత రోడ్ల నిర్మాణమూ, మరమ్మతూ, అభివృద్ధీ సాధించటానికై తగిన పరిశోధనలను జరపటానికి ఈ సంస్థ ఢిల్లీ నుంచి మధురకు వెళ్ళే రహదారిలో ఏర్పాటయింది. దీనిని 1952 జులై 16న ప్రధాని నెహ్రూ ప్రారంభించారు.





# ప్రశ్నోత్తరాలు

CHITRA

1. పి. రామచంద్ర, అనంతపూరు

అయ్యా, మీకు కథలు ఏ భాషలో పంపాలి? ఫొటోవ్యాఖ్యల పోటీకి ఏ భాషలో ఎన్ని వ్యాఖ్యలు పంపవచ్చును? మీకు పంపే కథలు ఎలా ఉండాలి?

తెలుగు, హిందీ, మరాఠీ, తమిళ, కన్నడ, గుజరాతీ భాషలలో కథలు పంపవచ్చు. ఒకవ్యక్తి ఈ భాషలలో ఎన్ని ఫొటోవ్యాఖ్యలైనా పంపవచ్చు. కథలు "చందమామ"లో పడే కథలకు తీసిపోనివిగా ఉండాలి; లేకపోతే మీరే తగాదాపెడతారుగద!

2. పి. రహంతుల్లా, అయిలాపురం

అన్నయ్యా, కథలను పంపినవారే దాని కవసరమగు చిత్రములను పంపవలెనా?

అవసరంలేదు. చిత్రాలు వేయటానికి శంకర్, చిత్రాగార్లున్నారు.

3. యం. నారాయణ, వరంగల్

మామా, "తోకచుక్క" పుస్తకము అచ్చువేశారా? వెలెంత?

"తోకచుక్క", "మకరదేవత" కలిసి ఒక పుస్తకంగా అచ్చవుతున్నాయి. వివరాలు "చందమామ" ప్రకటనల పేజీల్లో చూడండి.

4. కొడవంటి రామకృష్ణ, విశాఖపట్నం

విలియం షేక్స్పియర్ కథలు చదువుటకు ముచ్చటగా ఉన్నాయి. పూర్తి అయినాక అన్నికలిపి ప్రచురించెదరా?

షేక్స్పియరు కథలు ముగిశాయి. కాని వాటిని పుస్తకంగా తీసుకురావటానికి కొంత కాలం పడుతుంది.

5. జార్జ్ డేవిడ్, సికిందరాబాదు

ఇంగ్లీషు "చందమామ" రావడములేదు, కారణము చెప్పగలరా?

తగినంత ప్రోత్సాహం లేనందున ఇంగ్లీషు, సింధీ, మళయాళీ, ఒరియా "చందమామ"లను 1957 సెప్టెంబరులో నిలిపివేశాం.

6. వి. ఆర్. శేఖర్, చేబ్రోలు

క్రొత్త సంవత్సరం వచ్చింది. పాఠకులకు మీరిచ్చే బహుమతి ఏమిటి?

"జ్వాలాద్వీపం" సీరియల్.

7. డి. వెంకట రమణరావు, పామిడి

డిసెంబరు "కంచుకోట"లో కాలకేతుడు చంద్రవర్మతో సర్పకేతుడు నా శత్రువు అని చెప్పినాడు. ఏ కారణంగా?

ఈ ప్రశ్నలకు సమాధానాలు కథలోనే ఉన్నాయి. పాత సంచికలు చూడండి.

8. ప్రత్తిపాటి జ్ఞానం, అగ్రహారపట్నం

చందమామ మీదకు రష్యావారు కృత్రిమ ఉపగ్రహాన్ని పంపినారు. మీ అనుమతి పొందారా?

లేదుగాని, వారు చందమామపట్ల ఆదరంతోనే ఉన్నారుగనక మనం ఆగ్రహించ నవసరంలేదు!

9. కాజ వెంకటలక్ష్మిశారద, తెనాలి

ప్రతినెల "చందమామ" రాగానే అందరికన్నా ముందర నేనే చదువుతాను. ఎవరు అడిగినా ఇవ్వను. అందుకని మా అక్కలకు నేనంటే కోపం! నేను గయ్యాళినట!

వాళ్ళ మాటలు నమ్మకు. "చందమామ క్యూ"లో చిన్నపిల్లలదే ముందుస్థానం.

10. మండా శివరామమూర్తి, శ్రీకాకుళం

తాజ్ మహల్ నిర్మాణానికి 3 కోట్ల రూపాయలు వ్యయమయిందని మీరు వ్రాసేరు. 9 కోట్ల రూపాయలయిందని నా క్లాసు పుస్తకములో నేను చదివాను. ఏది తప్పు?

తాజ్ మహల్ నిర్మాణానికి 30 కోట్లు ఖర్చు అయినట్టు ఎక్కడో చదివినట్టు పాఠకుడు పి. మధుసూదన్‌రావు వరంగల్ నుంచి రాస్తున్నాడు. ఇప్పట్లో తాజ్ మహల్ అమ్మకానికి రాదు గనక దాని నిర్మాణవ్యయం ఎంత అయినా మనకు ఒకటే!

11. కే. ప్రేమగోపాల్, మచిలీపట్నం

చంద్రమండలంలో మీ "చందమామ"లు అమ్మటకు ఏజన్సీ తీసుకుంటాను, మీరు అనుమతిస్తారా?

విదేశీద్రవ్య మారకం చిక్కులన్నీ తమరే పడే పక్షంలో తప్పక అనుమతిస్తాము!

# 3. ప్రాణరక్షణ చేసిన కుక్క

షార్టీ చిన్న కుక్క. దాని వయసు ఏడాది మాత్రమే. అది స్పానియల్ జాతిది. దాని యజమానురాలు కూడా చిన్నదే, రెండేళ్లది. ఆ పిల్లపేరు బివర్లీ జీన్ స్ప్రింగర్. వాళ్లు కాలిఫోర్నియాలో శాక్రమెంటో నదితీరాన ఉండేవారు.

ఒక నడి శీతాకాలపు రోజున బివర్లీ జీన్ తమ దొడ్లో ఇరుగు పొరుగు పిల్లలతో ఆడు కుంటున్నది. ఆ పిల్లలందరూ బివర్లీ జీన్ కంటె పెద్దవాళ్ళు. ఆమెను ఒంటరిగా విడిచి మిగిలినవారందరూ పది నిమిషాలపాటు ఎటో వెళ్ళిపోయారట. వారు మళ్ళీ తిరిగి వచ్చేసరికి బివర్లీ జీన్ జాడ లేదు. వాళ్ళు తలుపు తట్టి ఆమెకోసం అడిగారు. అంత దాకా ఆమె తల్లికి తన కుమార్తె ఎటో పోయిందన్న విషయమే తెలియదు.

ఆమె కంగారుపడి తన కుమార్తెను కేక పెడుతూ, దొడ్డి అంతటా వెతికింది, చుట్టు పక్కల గల పొలాలన్నీ తిరిగింది. ఆమె వెనకడితే "కంయి, కంయి" మని అరుస్తూ కుక్కకూడా తిరిగింది. కాని బివర్లీ జీన్ పలకలేదు.

స్ప్రింగరు భార్య తన భర్తకు టెలిఫోను చేసింది. చుట్టుపక్కలవాళ్లంతా చేరి రోజల్లా పరిసరాలన్నీ ఘాలించారు; ఒకవంక పిల్ల కనపడక వాళ్ళు చిరాకుగా ఉంటె "షార్టీ" వారి కాళ్ళకు అడ్డంవచ్చి అరవసాగింది. వెతికేవాళ్లు దాన్ని రాళ్లువేసి కొట్టి దూరంగా తరమ యత్నించారు. అది బివర్లీ జీన్ తండ్రి బట్టలు పట్టుకుని లాగసాగింది.

పిల్ల జాడ షార్టీ చెబుతుందేమోనని ఆయనకు చివరకు తట్టింది. అందుచేత ఆయన అది తీసుకుపోయే చోటికి వెళ్ళ టానికి సిద్ధపడ్డాడు. బివర్లీ జీన్ ఆ విధంగా ప్రాణాలతో మళ్ళీ దక్కింది. ఆ పిల్ల ఒక కందకంలో చిక్కుకుపోయింది. దాదాపు ఇరవైగంటలసేపు అందులో ఉండి, చలి తోనూ ఆకలితోనూ బలహీనపడిపోవటంచేత ఆ పిల్ల కేకలు ఎవరికీ వినిపించలేదు. షార్టీ ఆమెను మృత్యుముఖంనుంచి రక్షించింది.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1960 మార్చి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అయ్యవారికీ దండం పెట్టు

రెండవ ఫోటో : అందేవరకూ పంతం పట్టు

పంపినవారు : గొంతి హనుమంతరావు,

1-1-336/51, వివేకనగర్, చిక్కడపల్లీ, హైదరాబాదు.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు తోటలో ఆడుకుంటూ వుండగా, 'టైగర్' వాళ్ళిచ్చిన బిస్కట్ ఒకటి నోట కరుచుకుని, ఆ పక్కలనే వున్న పొదల దగ్గిరకు వెళ్ళింది. వెంటనే పొదలోనుంచి బావురుపిల్లి ఒకటి అరవటం దానికి వినిపించింది. 'టైగర్' పారిపోయేందుకు వెనుదిరిగే సరికి, కాట్లకుక్క ఒకటి దూకుతూ మీదికి రావటం కనిపించింది. 'టైగర్' చటుక్కున బిస్కట్‌ను పొద దగ్గిర వదిలింది. కాట్లకుక్క ఆత్రంగా వచ్చి బిస్కట్‌ను తినబోయేంతలో, పొదలోనుంచి బావురుపిల్లి బయటికి దూకి, కాట్లకుక్క ముఖాన్ని గోళ్ళతో పీకింది. అవి రెండూ కలియబడే సమయంలో, 'టైగర్' తన బిస్కట్‌ను నోట కరుచుకుని పారిపోయింది.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# బాధ నివారణకు సంతోషముగు విధానము

నోపిన్ చక్కటి పేరి నిద్ర బాధను మాన్పును—హాయి లేకుండా చెమటలు కారుటవల్ల కాదు.

నోపిన్ చర్మమును మాడ్చి బొబ్బలు పొక్కనివ్వదు. మందులు ఎల్లప్పుడు వాడు అలవాటు చేయదు.

నోపిన్ చేయు విధానము ప్రఖ్యాత వైద్యుల చేత విజ్ఞాన వేత్తలచేత చేయబడి, ఎల్లప్పుడు తాజాగా సీలు వేసిన ట్యూబులలో నుండును.

# నోపిన్

ది కలకత్తా కెమికల్ కం. లిమిటెడ్, కలకత్తా—29.
1916 నుండి దేశమును సేవించుచున్నది.




ఎల్లప్పుడు ఒక నోపిన్ ట్యూబును అందుబాటులో ఉంచుకొనుడు

కండరముల నొప్పి, తల నొప్పి, బెణుకు, గుండె జలుబు, మొ. వాటినుండి సత్వర విముక్తి నిచ్చును.

దక్షిణ ఇండియా ఆఫీసు: 5/149, బ్రాడ్వే, మద్రాసు-1.

---

# Nutrine

LACTO BONBONS • SOFT CENTRES






## ఎక్కడ విన్నా న్యూట్రిన్ ప్రశంసే






CREAM TOFFEES • LOZENGES • BOILED SWEETS • GIFT PACKINGS • LACTO BONBONS • SOFT CENTRES

తయారు చేయువారు:
ది న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెని, ప్రైవేట్ లిమిటెడ్. చిత్తూరు - (ఆంధ్ర ప్రదేశ్)






ముఖమల్ వంటి ఆ మృదువైన
ముఖ వర్చస్సుకు

# టాల్కం
# పౌడరు

రాజా స్నో ముఖకాంతిని
వికసింపజేసే నాణ్యమైన
ఒకే సౌందర్య సాధనము.
ఇప్పటినుంచీ రాజాస్నో వాడుకను
ప్రారంభించండి. రాజా టాల్కం పౌడరు
మీ ముఖవర్చస్సుకు ఎంతో మెరుగుపెట్టుతుంది.







★ ★ ★

Use RAJA KASTURI SOAP for luxury Bath
RAJA BAR SOAP for easy washing

**MFRS: MANYAM & CO., BANGALORE-3**

GP

---



మీ
పాపాయికి
ఇష్టం

# స్పెన్సర్స్
# గ్రైప్ సిరప్

పసిపిల్లల సమస్తమైన అజీర్ణ
వ్యాధులకు




ఆంధ్ర రాష్ట్రానికి సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
**ది స్వతంత్రా ఏజెన్సీస్,**
రామవిహార, హనుమాన్‌పేట, విజయవాడ-2.

Photo by P. N. Mehra



బహుమతి
పొందిన వ్యాఖ్య

అందేవరకూ పంతం పట్టు

పంపినవారు:
ఎస్. హెచ్. రావు - హైదరాబాద్

